Licenced to Post without Prepayment (PMG/VJ/PWPP/17/2009-11)



స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు | స్థాపితం: 1930 | జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్‌రైతు

సంపుటి: 81 • సంచిక: 16 • 16-4-2010 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-



## • డిఎస్, విహెచ్‌లలో

## ఎవరికి అదృష్టం?

పిసిసి అధ్యక్షుడు డి.శ్రీనివాస్, రాజ్యసభ సభ్యుడు వి.హనుమంతరావులలో ఒకరిని శాసన మండలికి ఎంపిక చేసి, ఉప ముఖ్యమంత్రిగా నియమించాలని కాంగ్రెస్ అధిష్ఠానం ఆలోచన చేస్తున్నట్లు వినికిడి. డిఎస్ అందుకోసం చాలాకాలం నుంచి ప్రయత్నం చేస్తున్నాడు. ఇప్పటికిప్పుడు మంత్రివర్గ విస్తరణ జరగకుండా అడ్డుపుల్ల వేయడానికి ఢిల్లీలో తన శక్తినంతా వెచ్చించింది కూడా అందుకోసమేనని చెప్తున్నారు. రెండు ఎన్నికలలో పిసిసి అధ్యక్షుడిగా కాంగ్రెస్ గెలుపుకు కష్టపడ్డాడన్న సానుభూతి డిఎస్ మీద వుంది. పైగా ఆయన తెలంగాణకు చెందిన వెనుకబడిన తరగతులకు చెందినవాడు. శ్రీకృష్ణ కమిటీ నివేదిక తర్వాత తలెత్తబోయే రాజకీయ సంక్షోభాన్ని నివారించాలంటే తెలంగాణ నాయకుడిని ఉప ముఖ్యమంత్రిగా నియమించడం అవసరం. గీతారెడ్డి, మర్రి శశిధర్‌రెడ్డి, జానారెడ్డి వంటివారు ఆ పదవి ఆశిస్తున్నా వారికంటే డిఎస్ మెరుగని ఢిల్లీ పెద్దల భావన అట.

కొరవ 14వ పేజీలో

## • రోశయ్య అంతరంగం అర్థం కావడం లేదు

# తోక ముడిచాడా? మాయ చేస్తున్నాడా?

సిద్దడు అద్దంకికి పోనూపోయాడు, రానూ వచ్చాడన్నట్లు సాగింది ముఖ్యమంత్రి రోశయ్య తాజా ఢిల్లీ పర్యటన. ఆయన హస్తినాపురికి వెళ్లిన ఉద్దేశం, రాష్ట్ర మంత్రివర్గ విస్తరణకు అధిష్టానం రాజముద్రిక అద్దించుకొని రావడం. కానీ సోనియాగాంధీని కలిసి బయటకు వచ్చిన తర్వాత ముఖ్యమంత్రి ముఖ కవళికలు, మాటల తీరు గమనించిన వారికి మాత్రం సిద్దడు అద్దంకికి పోయి వచ్చిన సామెత గుర్తుకు వచ్చింది.

నిజంగా రోశయ్య, సోనియాగాంధీల సమావేశంలో ఏ అంశాలు చర్చకు వచ్చాయో ఎవరికీ తెలియదు. ఆ సమయంలో లోపలున్నది వారిద్దరు మాత్రమే. మూడో మనిషి లేడు. అందువల్ల మంత్రివర్గ విస్తరణకు ఆమె అనుమతి ఇచ్చిందో నిరాకరించిందో వారిద్దరికి మాత్రమే తెలుసు. అయితే అంతకు ముందు ఢిల్లీలో కెవిపి రామచంద్రరావు, పిసిసి అధ్యక్షుడు డి.శ్రీనివాస్‌లు జరిపిన మంత్రాగాన్ని బట్టి, వారు విలేకరులతో యధాలాపంగా చేసిన వాఖ్యలనుబట్టి, మంత్రివర్గ విస్తరణ లేదనే అభిప్రాయం కల్గింది. రోశయ్య కూడా అదే తీరులో మాట్లాడడు. అందరూ అదే భావనలో వున్నారు.

### సోనియా సానుభూతి

కానీ ముఖ్యమంత్రి రోశయ్య అందరూ అనుకొనేంత అమాయకుడు, రాజకీయ అనుభవ శూన్యుడు అనుకోవడం పెద్ద పొరపాటు. నిజానికి మంత్రివర్గ విస్తరణకు ఆయనకు సోనియాగాంధీ నవంబర్ నెలలోనే అనుమతి ఇచ్చిందన్నది బహిరంగ రహస్యం. తెలంగాణ ఉద్యమం, గొడవలు, శాసనసభ సమావేశాలు, పాతబస్తీ మతకలహాలు వంటి గందరగోళాల వల్ల ఆ ముచ్చట తీర్చలేక పోయాడు ముఖ్యమంత్రి. ఈ మధ్య కాలంలో రాష్ట్రం నుంచి ఎవరు సోనియాగాంధీని కలిసినా రోశయ్య పట్ల చాలా సానుభూతితో మాట్లాడారు. అయ్యోపాపం, రోశయ్య, పదవి వచ్చినప్పటి నుంచి ఏదో ఒక సమస్య ఇబ్బంది పెడుతూనే వుంది ఆయన్ను అంటూ వ్యాఖ్యానించారు. అన్ని సమస్యలు వచ్చినా బాగా పని చేస్తున్నాడన్న కితాబు కూడా ఇచ్చారు. ముఖ్యమంత్రి మీద ఇంత సానుకూల అభిప్రాయాలు కల్గిన కాంగ్రెస్ అధినేత్రి, ఇప్పుడు మాత్రం ఆయన చేతులు కాళ్లు కట్టిపడేయాలని ఎందుకు అనుకొంటున్నారు? ఆ మాట నమ్మశక్యంగా లేదు.

### మంత్రులు మాట వినరు

రాజకీయంగా ఆలోచన, ఏ కారణంతో మంత్రివర్గ విస్తరణ వాయిదా వేసినా ముఖ్యమంత్రి పదవిలో వుండీ దండగే. పాతబస్తీ మత కల్లోలాలకు జగన్ బాధ్యుడన్న పరోక్ష సంకేతాలు పోలీసు అధికారుల వద్ద వ్యక్తం చేసిన ముఖ్యమంత్రి, అదే జగన్‌తో భేటీ జరిపిన నాటి నుంచి రాష్ట్ర కాంగ్రెస్‌లో చాలా మార్పులు వస్తున్నాయి. ఒకేసారి పదిమంది జగన్ అనుచరులన్న వారిని వూడబెరకనున్నాడన్న వార్త ప్రచారంలోకి రాగానే, జగన్ వీర విధేయులైన మంత్రులంతా రోశయ్య కరుణా కటాక్ష వీక్షణాల కోసం వెంపర్లాడారు. జగన్‌తో మాకు సంబంధం లేదు, మీతోనే కలిసి నడుస్తామని బాసలు చేశారు. అధికారులు కూడా ఒళ్లు దగ్గర పెట్టుకొని ప్రవర్తించడం నేర్చుకొన్నారు. ఇప్పుడు కెవిపి మంత్రాంగం వల్ల మంత్రివర్గ విస్తరణ నిలిచి పోయిందన్న అభిప్రాయం ఏర్పడితే ఈ మంత్రులంతా ప్లేట్ ఫిరాయించడం ఖాయం. ముఖ్యమంత్రి పలుకుబడి, ప్రతిష్ట పలచబడడం నిజం. ఆ మాత్రం లోక జ్ఞానం లేనివాడు కాదు రోశయ్య.

### అసమ్మతని భయపెట్టారా?

ఇక్కడ, ఇంతే విశ్వసనీయత కల్గిన మరొక వాదన కూడా వుంది. తీసివేతలు, కూడికలతో మంత్రివర్గ ప్రక్షాళన జరిపినప్పుడల్లా రాష్ట్ర కాంగ్రెస్‌లో అసమ్మతి ఉప్పెన ఉవ్వెత్తున ఎగిసిపడడం సాంప్రదాయం. మర్రి చెన్నారెడ్డి, కోట్ల విజయ భాస్కర్‌రెడ్డి వంటి ఉద్దండులనే అసమ్మతి అస్త్రంతో మూడు చెరువుల నీళ్లు త్రాగించాడు వైఎస్.రాజశేఖర్‌రెడ్డి. ఇప్పుడు జగన్ కూడా అదే బాటలో నడిస్తే ఏమిటన్నది ప్రశ్న. జగన్ అనుచరులనుకొన్న వారు ఐదు మందినో, పదిమందినో వూడబెరికితే వారు వూరుకుండరు కదా? ఓదార్పు యాత్రతో

కొరవ 14వ పేజీలో

## కార్టూన్ స్కేప్




గాంధీజీ, అంబేద్కర్‌ల గురించి కూడా వాళ్లకు తెలుసోలేదో...చెబుదామా బావా!

# వీళ్లా మంత్రులు?

కేంద్ర విదేశాంగ సహాయ మంత్రి శశిథరూర్ తరచు రచ్చకెక్కుతున్నాడు. వీధిన పడుతున్నాడు. ఐక్యరాజ్య సమితిలో అండర్ సెక్రటరీగా పనిచేసిన విశేష అనుభవం, ప్రధాన కార్యదర్శి పదవికే పోటీ పడే స్థాయి కల్గిన వ్యక్తిగా ఆయన్ను కాంగ్రెస్ పార్టీ రాజకీయాలలోకి ఆహ్వానించింది. కేరళ నుంచి ఎమ్పీగా గెలిపించి, ఏకంగా విదేశాంగ మంత్రిని చేసింది. ఐక్యరాజ్య సమితిలో, ఉన్నతస్థానాలలో దీర్ఘకాలం పని చేసిన వ్యక్తి కాబట్టి, అంతర్జాతీయ వ్యవహారాల మీద పూర్తి స్థాయి అవగాహన వుంటుందని, దౌత్యనీతి పాటించడంలో దేశానికి ఉపయోగపడతాడని భావించి, ఆయన్ను ఈ అందలం ఎక్కించారు. కానీ ఉన్నతస్థానాలలో వున్నంత మాత్రాన బుద్ధులు మారవన్న నిజాన్ని పదేపదే బయటపెట్టుకొంటున్నాడు శశిథరూర్.

కేంద్రమంత్రిగా ప్రమాణ స్వీకారం చేయగానే, ఢిల్లీలోని ఒక ఐదు నక్షత్రాల హోటల్‌లో, రోజుకు ఒక గదికి పది వేల రూపాయల అద్దె చెల్లించి మరీ మకాం పెట్టాడు శశిథరూర్. ప్రభుత్వ పెద్దలకు ఈ విలాసాల కథ తెలిసే సరికి కోటి రూపాయలకు పైగా ప్రభుత్వ ధనం హోటల్ గదుల అద్దెకు రామార్పణ అయిపోయింది. ప్రణబ్ ముఖర్జీ గట్టిగా మందలించి, ఒక రకంగా చెప్పాలంటే మెడపెట్టి బయటకు గెంటే వరకు హోటల్ గది వదలి రాలేదు థరూర్. ఆర్థిక మాంద్యం దృష్ట్యా మంత్రులు, ఉన్నతాధికారులు విమానాలలో ఫస్ట్‌క్లాస్ ప్రయాణం మానుకొని, ఎకానమీ క్లాస్‌లోనే తిరగాలని ఆర్థికమంత్రి ఆదేశించడం పైన శశిథరూర్ చేసిన వ్యాఖ్యలు భారతీయ సమాజాన్నే అవమానించే తీరులో వుండినాయి. పవిత్రమైన ఆవులు చెప్పినప్పుడు పశువుల తరగతిలో తిరగక తప్పుదుకదా అని పయనీర్ పత్రికకు ఇచ్చిన ఇంటర్వ్యూలో వ్యాఖ్యానించాడు ఆ పెద్ద మనిషి. ఆయన దృష్టిలో విమానాలలో ఎకానమీ తరగతిలో ప్రయాణించే వారంతా పశువులతో సమానమన్న మాట. పేదలు, మధ్యతరగతి ప్రజలంటే అంత చులకన భావం కల్గిన వ్యక్తి భారతదేశానికి పాలకుడు కావడం దారుణమైన నేరం.

ఆయన తాజాగా చేసిన నేరం – తన ప్రియురాలికి కేరళ ఐపిఎల్ జట్టులో 70కోట్ల విలువ చేసే ఉచిత వాటా ఇప్పించడం. క్రికెట్ క్రీడాభిమా నులను వెర్రెక్కిస్తున్న ఐపిఎల్ – ఒక మాయా జూదం వంటిది. ప్రజలలోని క్రీడాభిమానాన్ని వేల కోట్ల రూపాయల వ్యాపారంగా మార్చిన విష సంస్కృతి అది. దానిలోకి తాజాగా రెండెవూ అనే సంస్థ ప్రవేశించింది. కేరళ పేరుతో ఒక జట్టును ప్రవేశపెట్టే హక్కులను 1700 కోట్ల రూపాయలకు కొనుగోలు చేసింది. ఆట పాటలకు ఇంత డబ్బు వెదజల్లగలిగేంత సంపద వారిదగ్గర ఎట్లా పోగు పడిందో, అందులో ఎవరెవరు భాగస్వాములో బయటి ప్రపంచానికి తెలియదు. శశిథరూర్ త్వరలో మూడో పెళ్లి చేసుకోబోతున్న ఒక కాశ్మీరీ సుందరికి ఇందులో వాటా వుందని ఐపిఎల్ ఛైర్మన్ లలిత్‌మోడి బయట పెట్టాడు. ప్రభుత్వంలో బాధ్యాతాయుతమైన స్థానంలో వున్న వ్యక్తి, మూడో పెళ్లి చేసుకోవడమే ఒక నేరం. అందుకు కానుకగా ఆమెకు 70 కోట్ల విలువైన కానుక ఇవ్వడం ఇంకా పెద్ద నేరం. ఏ ప్రయోజనమూ లేకుండా ఏ కంపెనీ కూడా ఒక మంత్రి ప్రియురాలికి అంత భారీ కానుక ఇవ్వదు కదా? శశిథరూర్ తన అధికార పరిధిలో ఏదో తెలియని అక్రమ ప్రయోజనాన్ని ఆ కంపెనీకి చేసి పెట్టినందు వల్లనే ఈ రూపంలో ప్రతిఫలం ఇచ్చారని పసిపిల్ల వాడినడిగినా చెప్తాడు. మంత్రి పదవులను ఇంత నిస్సిగ్గుగా తమ ప్రియురాళ్లకు, వెలయాళ్లకు తాకట్టు పెట్టే హీనులను కేంద్ర మంత్రివర్గంలో ఒక్క క్షణం కూడా కొనసాగించడం ధర్మం కాదు. అది దేశాన్ని, ప్రజలను అవమానించడం క్రిందనే లెక్క. సోనియాగాంధీతో సాన్నిహిత్యం వుందన్న ఒకే ఒక కారణంతో శశిథరూర్ వంటివాళ్లు ఏమి చేసినా చెల్లిపోతుందన్న అభిప్రాయం కల్గడం ప్రజాస్వామ్యానికి శ్రేయస్సు కాదు. ఈ విలాస పురుషుడిని తక్షణం మంత్రిపదవి నుంచి పూడబెరకడం కాంగ్రెస్ పార్టీ కర్తవ్యం. దానితో పాటుగా ఇటువంటి భ్రష్టులను తన క్యాబినెట్‌లో ఇంతకాలం కొనసాగించినందుకు ప్రధాని మన్మోహన్ సింగ్ జాతికి క్షమాపణ చెప్పవలసిన అవసరం కూడా వుంది.

జమీన్‌రైతు

## జనవాణి

### గబ్బుపట్టిన సానియా మీర్జా!

హైదరాబాద్ టెన్నిస్‌స్టార్ సానియా మీర్జా గతంలో జరిగిన నిశ్చితార్థాన్ని త్రోసిరాజని పాకిస్తాన్ క్రికెటర్ షోయబ్ మాలిక్‌కు రెండవ భార్యగా వెళ్లడం బాధను కల్గిస్తుంది. ఇంత అవసరం ఆమెకు ఎందుకు వచ్చిందో అర్థమే కావడం లేదు. పాకిస్తానీ అయిన షోయబ్ తనకు ఆయేషాకు పెళ్లికాలేదని చివరి వరకు బుకాయించాడు. పోలీసు దర్యాప్తు ముమ్మరం కావడంతో మార్గాంతరం లేక ఆమెకు విడాకులిచ్చాడు. ఇటువంటి వ్యక్తి కోసం సానియా మీర్జా లాంటి రోల్‌మాడల్ వెంపర్లాడడం పెళ్లికి సిద్ధపడడం ఆమె దురదృష్ట మని చెప్పక తప్పదు.

ఎం. సుధామయి, నెల్లూరు

### ధరలు తగ్గించాలి!

నిత్యావసర వస్తువుల ధరల పెరుగుదలపై పార్లమెంటు బడ్జెట్ సమావేశాలలో ప్రతిపక్షపార్టీలు ప్రభుత్వాన్ని గట్టిగా నిలదీయడం, చర్చించడం జరిగింది. ప్రభుత్వం ధరలు కొద్దిరోజులలో తగ్గుతాయని హామీ ఇచ్చింది. మొత్తం మీద బియ్యం, పప్పుల ధరలు స్వల్పంగా తగ్గాయి. కాని మళ్లీ పెట్రోలు, డీజిల్ ధరలు పెంచడంతో మధ్యతరగతీయులపై తిరిగి ఆర్థికభారం పెరిగింది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ప్రజల కిచ్చిన మాటకు కట్టుబడి చిత్తశుద్ధితో ఆహార వస్తువుల ధరలు తగ్గించి అవి తిరిగి పెరగకుండా తగిన చర్యలు తీసుకోవాలి.

పి.అరుణకుమారి, నెల్లూరు

### ఉస్మాన్‌సాహెబ్‌పేటలో శబ్దకాలుష్యం!

నెల్లూరు ఉస్మాన్‌సాహెబ్‌పేటలో చాలా టింబర్ డిపోలున్నాయి. వాటికి కొయ్య దుంగలు తెచ్చే లారీల వల్ల ట్రాఫిక్ నిలిచిపోయి ప్రజలు నానా ఇక్కట్లు పడాల్సివస్తున్నది. టింబర్ డిపోల్లో ఉదయం ఆరుగంటల నుంచి అర్ధరాత్రి వరకు పని జరుగుతుంది. డిపోల్లో నుంచి వచ్చే పెద్ద పెద్ద శబ్దాలు ప్రజల ఆరోగ్యాన్ని దెబ్బతీస్తున్నాయి. ఈ ప్రాంతంలోనే వున్న పేపరు మిల్లులు, పప్పుల మిల్లుల వల్ల వాయుకాలుష్యం ఏర్పడుతుంది. జనసామర్థ్య ప్రదేశమైన ఉస్మాన్‌సాహెబ్‌పేట నుంచి టింబర్ డిపోలు, పప్పుల మిల్లులు తరలింపుకు కార్పొరేషన్ అధికారులు తగిన చర్యలు తీసుకోవాలి.

పి.ఆదిలక్ష్మి, నెల్లూరు

## 70 ఏళ్ల క్రితం ఈవారం

19-4-1940
పేజీలు : 12 వెల: అణా

### వెంకటగిరి గలాటా

అరవ దళితులను 30 మందిని అరెస్టు చేశారు. వెంకటగిరి ఎస్టేటు అడవులలో కట్టెలు తెచ్చుకొనే విషయమై అరవ దళితులకు ఎస్టేటు వారికి చాలా రోజులుగా తకరారుగా వుండి కోర్టు వ్యవహారాలు వగైరాలు కూడా నడచినవి. సివిలు కోర్టువారు 38 మంది అరవ దళితుల మీద ఇంజక్షను ఆర్డరు గూడా యిచ్చారు. అరవ దళితులు చేసిన అప్పీలు సివిలు కోర్టులో వుంది. అప్పీలు అనంతరం ఇంజక్షన్ యిచ్చిన వారు గాక మరికొందరు రెండు మాసాలుగా కట్టెలకు వెళ్లి తెచ్చుకొంటున్నట్లున్నూ 16తేది గూడా కొందరు కట్టెలు తెచ్చుకొనుటకు అడవికి వెళ్లగా వెంకటగిరి పోలీసువారు ఆడవాండ్లను, మగవాండ్లను 30 మందిని అరెస్టు చేసినట్లున్నూ తెలుస్తున్నది– పోలీసు.

* * *

పెళ్లకూరు రామలింగారెడ్డిగారిపై వెంకటగిరి ఎస్టేటు వారు తెచ్చిన క్రిమినల్ కేసును కొట్టివేస్తూ ఎస్టేటు శిస్తు వసూలు విధానం గూర్చి గూడూరు జాయింట్ మేజిస్ట్రేటుగారు యిచ్చిన–

### సర్టిఫికేటు

" వెంకటగిరి ఎస్టేటు నౌకరులకు ఎస్టేటులోని శిస్తు వసూలు విధానం తెలియదు".

పెళ్లకూరు రామలింగారెడ్డిగారి మీద వెంకటగిరి వారు తెచ్చిన క్రిమినల్ కేసు ఏమిటంటే రామలింగారెడ్డిని ఓజిలి గ్రూపు గ్రామాదులకు శిస్తులు వసూలు ఏజంటుగా ఎస్టేటువారు నియమించి యుండిరనీ, రైతుల వద్ద వసూలు చేసి రశీదులు ఇచ్చిన దానిలో రు. 3-6-9లు మాత్రమే ఖజానాకు యిరసాలు చేసి మిగతా మొత్తం రు. 24-9-0లను అపహరించినాడని. ఎస్టేటు వారి తరపున 10 మంది సాక్షులు విచారించబడిరి.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

15-4-1960
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### నెల్లూరు కలెక్టర్ కారుకు ఘోరప్రమాదం

హైదరాబాదులో జరిగిన కలెక్టర్ల సమావేశంలో పాల్గొని తిరిగి వస్తుండిన నెల్లూరు జిల్లా కలెక్టర్ ఎం.ఎం. బేగ్ కారు, నెల్లూరుకు ఉత్తరం 24 మైళ్ల దూరంలో కడనూతల గ్రామం వద్ద రెండెద్దుల బండిని ఢీకొని ఘోర ప్రమాదానికి గురియైనది. కలెక్టరు క్యాంపు క్లర్కు లక్ష్మీకాంతం అక్కడికక్కడే దుర్మరణం జెందాడు. కలెక్టరు, వారి సతీమణి, బిడ్డలు స్వల్పగాయాలతో ప్రమాదం నుంచి బయటబడ్డారు. కారు డ్రైవరు మాత్రం తీవ్రంగా గాయపడి చికిత్స పొందుతున్నాడు.

### దొంగనోట్లు

ఇటీవల నెల్లూరులో నాలుగు దొంగ వంద రూపాయల నోట్లు పట్టుపడినవి.

1–3–60తేది కోవూరు తాలుకా ఊటుకూరు వాస్తవ్యుడు శివారెడ్డి శేషరెడ్డి (కవిగాడు) జోబిలో ఒక దొంగ వందరూపాయల నోటు వుండగా పట్టుకోబడింది. 23–3–60తేది సింగరాయకొండ వాస్తవ్యుడు ఏ.పి.ఎస్ 1129 లారీ క్లీనరు నల్లపనేని నరసింహులు; 31–3–60 తేది నెల్లూరు తాలుకా సోమరాజుపల్లి వాస్తవ్యుడు దేవిరెడ్డి రామచంద్రారెడ్డి; 2–4–60 తేది నెల్లూరు తాలుకా కోడూరు ఆక్టింగు మునసబు పెమ్మారెడ్డి పిచ్చిరెడ్డి – ఈ ముగ్గురు ఒక్కొక దొంగ వందరూపాయల నోటును మార్చుకోవడానికి స్టేట్ బ్యాంకుకు తీసుకపోగా, వారిని బ్యాంకు వారు పట్టుకొని, పోలీసుకు రిపోర్టు జేయగా, నోట్లను మాత్రం స్వాధీనం జేసుకొని, వ్యక్తులను వదలి వేసినట్లు తెలుస్తున్నది. పోలీస్ వీరిని విచారించగా, బియ్యం కొనుగోలుకు వ్యాపారస్తులు తమకిచ్చినట్లు చెప్పారట.

ఈ దొంగనోట్లు, పూర్వం నాడార్ అనే వ్యక్తి, అచ్చువేసిన లక్షలాది దొంగ కరెన్సీ నోట్లకు సంబంధించి వుండవచ్చునని పోలీస్ అనుమానం. సిఐడి శాఖ విచారణ జరుపుతున్నది.

# నెల్లూరు ముచ్చట్లు

## మూతబడనున్న విఆర్ చిల్డ్రన్స్ అకాడమీ!

వందేళ్లకు పైగా చరిత్ర వున్న విఆర్ విద్యాసంస్థల సోదర సంస్థగా 15 ఏళ్ల క్రితం ఏర్పాటుచేసిన విఆర్ చిల్డ్రన్స్ అకాడమీని ఈ విద్యా సంవత్సరం ముగియడంతో మూతవేయనున్నట్లు విశ్వసనీయవర్గాల ద్వారా తెలిసింది. నెల్లూరు నగరంలో చోటా మోటాల నేతృత్వంలో నడుస్తున్న స్కూళ్లు సైతం బ్రహ్మాండంగా వున్నాయి. విఆర్ బ్రాండ్ ఇమేజ్ వున్న చిల్డ్రన్స్ అకాడమీని విఆర్ సంస్థల సర్వాధినేతలు ఎందుకు నిర్వహించలేకపోయారో? విఆర్ ఐఎఎస్ సంస్థ పరిస్థితి కూడా దెబ్బతిన్నట్లు తెలిసింది.

## ఎసి మార్కెట్‌లో తీరుపై కలెక్టర్ ఆగ్రహం!

నెల్లూరులోని ఎసి సుబ్బారెడ్డి కూరగాయల మార్కెట్‌లోని వ్యాపారులను అదుపుచేసే స్థితిలో మార్కెటింగ్ శాఖాధికారులు ఎందుకు లేకుండాపోయారో అర్థం కావడంలేదని కలెక్టర్ రాంగోపాల్ ఆశ్చర్యాన్ని వ్యక్తం చేశారు. వినియోగదారుల సమితి ప్రతినిధులతో కలెక్టరేట్‌లోని తన చాంబర్‌లో 13వ తేది సమావేశమైన కలెక్టర్ మార్కెట్‌లోని వ్యాపారులుచేసే దౌర్జన్యాలను విని ఆశ్చర్యపోయారు. ఇక్కడ వ్యాపారం చేసే ప్రతి వ్యాపారి ఎలక్ట్రానిక్ కాటాలు ఏర్పాటు చేసుకొనేలా చేయడంతోపాటు దారి కొచ్చే వరకు తనిఖీలు చేయమని మార్కెటింగ్, తూనికలు కొలతల శాఖాధికారులకు సూచించారు.

## ముఖ్యమంత్రి పర్యటన వాయిదా

ముఖ్యమంత్రి కొణిజేటి రోశయ్య జిల్లా పర్యటన రద్దయ్యింది. ఈ నెల 14వ తేది ముఖ్యమంత్రి నెల్లూరుకు వచ్చి ఐదవ విడత భూ పంపిణీని ప్రారంభించాల్సి వుంది. ఏర్పాట్లు జరుగుతుండగా ఆయన పర్యటన వాయిదా పడినట్లు జిల్లా అధికారులకు సమాచారం అందింది. ఈ నెల చివరి వారంలో ముఖ్యమంత్రి జిల్లాకు రావచ్చునని ప్రచారం జరుగుతోంది.



## తెలుగుదేశం పార్టీ సభ్యత్వ నమోదు!

తెలుగుదేశం పార్టీ సభ్యత్వ నమోదు కార్యక్రమం 9వ తేది నెల్లూరులోని పార్టీ ఆఫీసులో ప్రారంభమయ్యింది. నెల్లూరు, ఉదయగిరి, ఆత్మకూరు నియోజకవర్గాలకు చెందిన ముఖ్య నాయకులకు, పార్టీ పరిశీలకుడు గంటుపల్లి నాగేశ్వరరావు సభ్యత్వాలిచ్చారు. జిల్లాలో లక్షా 20వేల మందిని పార్టీ క్రియాశీలక సభ్యులుగా చేర్చాలని నిర్ణయించినట్లు తెలుగుదేశం పార్టీ జిల్లా కన్వీనర్ సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి చెప్పారు.

## బిసి కమిషన్ రాక

బిసి కమిషన్ ఛైర్మన్ జస్టిస్ దాల్వ సుబ్రహ్మణ్యం, సభ్యులు సి.హెచ్.పాండురంగ, బి.రఘురాం ప్రసాద్, ఎన్.బంగారు రాజు 19వ తేది నెల్లూరు వస్తారు. అనంతరం వెంకటగిరి వెళ్లి 'జెట్టి'కుల పూర్వాపరాలను విచారిస్తారు.

## రెండవ పంటకు నీరు విడుదల

జిల్లాలోని రైతులు రెండవ పంటను పండించను అవసరమైన నీటిని 11వ తేది సోమశిల ప్రాజెక్ట్ నుంచి విడుదల చేశారు. పెన్నా డెల్టాలో లక్షా 91వేల 234 ఎకరాలకు, కావలి కాల్వ పరిధిలో 50వేలు, దక్షిణ కాల్వ పరిధిలో నాలుగువేల ఎకరాలకుగాను రెండవ పంటకు నీళ్లిస్తారు.

## ధరలు పెరుగుతాయని రిజిస్ట్రేషన్లు!

ఈ నెల 15వ తేది భూముల ధరలను ప్రభుత్వం పెంచుతుందన్న వార్తలు రావడంతో 12వ తేది నెల్లూరు రిజిస్ట్రార్ ఆఫీసులో 500లకు పైగా రిజిస్ట్రేషన్లు జరిగాయి. మధ్యాహ్నం మూడు గంటల నుంచి రాత్రి తొమ్మిది గంటల వరకు రిజిస్ట్రార్ ఆఫీసు కిటకిటలాడుతూ పని చేసింది. ఈ మధ్య నగరంలో భూముల రేట్లు విపరీతంగా పెరగడంతో రిజిస్ట్రేషన్లు బాగా తగ్గాయి. రిజిస్ట్రేషన్ల ద్వారా వస్తున్న ఆదాయం చాలడంలేదని ప్రభుత్వం తలపోసి మళ్లీ భూముల రేట్లు పెంచుతుంది.



## రోడ్డు మార్జిన్ వ్యాపారుల తొలగింపు!

నెల్లూరు ఎసి కూరగాయల మార్కెట్ ముందు ఆకుకూరలు, కూరగాయలు, పండ్లు, నిమ్మకాయలు అమ్ముకునే చిన్నవ్యాపారస్తుల అంగళ్లను మునిసిపల్ అధికారులతో కలసి పోలీసులు తొలగించారు. దీంతో మార్కెట్ దగ్గర వ్యాపారాలు చేసేవారు సిపిఎం నేతృత్వంలో ప్రదర్శనగా వెళ్లి జిల్లా కలెక్టర్, కార్పొరేషన్ కమిషనర్, ఎస్పీని కలసి తమ బాధలు చెప్పుకొన్నారు. రోడ్డు మార్జిన్ వ్యాపారులకు మార్కెట్ ప్రక్కనే వున్న పాత కోనేరు స్థలంలో వ్యాపారాలు చేసుకొనే అవకాశం ఇవ్వాలని కలెక్టర్ కమీషనర్‌ను కోరారు. ఎస్పీ దామోదర్ అయితే రోడ్డు మార్జిన్ వ్యాపారులను ఫత్తేఖాన్‌పేటలోని రైతుబజారులో స్థిరపడమని సలహా యిచ్చారు. రోడ్డు ప్రక్కన వ్యాపారాల వల్ల మార్కెట్ వద్ద ట్రాఫిక్ ముందుకు కదలడం లేదన్న అభిప్రాయానికి వచ్చిన ఎస్పీ ఈ తొలగింపులు చేపట్టారు.

### చందాదారులకు మనవి

- చందా పంపించేటప్పుడు తమ చందా నెంబరు, పూర్తి పేరు, చిరునామా తెలియపరచండి.
- 'జమీన్‌రైతు' చందాదార్లు తమ చందాను ఎం.ఓ/డి.డి రూపంలో మాత్రమే పంపగలరు. చెక్కులు స్వీకరించబడవు.
- మీ చందా నెంబరు, చందా ఏ తేదికి అయిపోతుందో, అడ్రసు రేపరు మీదనే ముద్రించి వుంటుంది. సకాలంలో చందా చెల్లించవలసినదిగా కోరు తున్నాము.

జీవిత చందా రూ.1000/-

సంవత్సర చందా
స్వదేశంలో రూ.200/-
విదేశాలకు రూ.1000/-

జమీన్‌రైతు
పొగతోట, నెల్లూరు - 524 001
ఫోన్: 0861 - 2327354
సెల్: 98489 66190

## తిరుమలలో వేమిరెడ్డి అతిథి గృహం!

నెల్లూరీయుడు, పేరుగాంచిన కాంట్రాక్టర్ వేమిరెడ్డి ప్రభాకర్‌రెడ్డి తిరుమలలోని బాలాజీనగర్ ప్రాంతంలో సొంత నిధులు వెచ్చించి భక్తుల కోసం లక్ష్మి అతిథి గృహాన్ని కట్టించారు. దీన్ని శాసనమండలి ఛైర్మన్ చక్రపాణి ఇటీవల ప్రారంభించారు. ఈ కార్యక్రమంలో తిరుమల తిరుపతి దేవస్థానం పాలక మండలి ఛైర్మన్ డి.కె.ఆదికేశవులు నాయుడు, రాష్ట్ర అటవీ శాఖ మంత్రి పెద్దిరెడ్డి రామచంద్రారెడ్డి, కర్ణాటక మంత్రి గాలి కరుణాకర్‌రెడ్డి, అతిథి గృహం నిర్మాత వేమిరెడ్డి ప్రభాకర్‌రెడ్డి పాల్గొన్నారు.



కాంగ్రెస్ ఎస్సీసెల్ ఆధ్వర్యంలో ఇందిరాభవన్‌లో జరిగిన అంబేద్కర్ జయంతి వేడుకల్లో బాలసుధాకర్, ఉదతా వెంకట్రావ్, పందిళ్లపల్లి అరుణమ్మ, రఘురాం ముదిరాజ్ తదితరులు.

## బొల్లినేనిలో ఎంఆర్ఐ స్కానింగ్!

నెల్లూరు బొల్లినేని సూపర్ స్పెషాలిటీ హాస్పిటల్‌లో ఎంఆర్ఐ స్కానింగ్‌ను 10వ తేది పురపాలక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి ప్రారంభించారు. కోస్తాంధ్రలోని హాస్పిటళ్లలో మొట్ట మొదటగా ఈ ఎంఆర్ఐ(1.5) టెస్లా స్కానింగ్‌ను తమ హాస్పిటల్‌లోనే పెట్టినట్లు హాస్పిటల్ అధినేత డాక్టర్ బొల్లినేని భాస్కరరావు చెప్పారు. నెల్లూరు ఎమ్మీ మేకపాటి రాజమోహన్‌రెడ్డి, హాస్పిటల్ నిర్వాహకుడు గిరినాయుడు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

## క్యాన్సర్‌కు అత్యాధునిక చికిత్స!

క్యాన్సర్ వ్యాధిగ్రస్తులకు రేడియేషన్ చికిత్స చేస్తుంటారు. దీనివల్ల కొన్ని ఇబ్బందులు తప్పవు. ఈ ఇబ్బందుల నుంచి ఉపశమనం కల్పించను చెన్నైలోని అపోలో హాస్పిటల్‌లో సైబర్ నైఫ్‌తో అత్యాధునిక చికిత్స చేయనున్నట్లు ఆంకాలజిస్ట్ డాక్టర్ సంజయ్ చెప్పారు. సైబర్ నైఫ్‌తో చికిత్సవల్ల సైడ్ఎఫెక్ట్స్ కూడా వుండవన్నారు. క్యాన్సర్ వ్యాధిగ్రస్తులకు ప్రాథమిక పరీక్షలను నెల్లూరులోని అపోలో ఇన్ఫర్మేషన్ సెంటర్‌లో చేస్తామని డాక్టర్ నరేంద్రరెడ్డి వివరించారు.

## అస్తిత్వ ప్రభవ

నెల్లూరు పొగతోటలోని ప్రభవలో 17వ తేది నుంచి 25వ తేది వరకు అంతర్జాతీయంగా పేరుగాంచిన స్కిల్ గురు గోగినేని బాబు అస్తిత్వ బోధన చేస్తారు. అస్తిత్వమంటే భావవ్యక్తీకరణ. దీన్ని అభివృద్ధి చేసుకోవడం వల్ల ప్రస్తుత సమాజంలో స్వతంత్ర వ్యక్తులుగా రాణించవచ్చు. అంతర్జాతీయంగా పేరుగాంచిన బాబును నెల్లూరుకు రప్పించి పెద్దలు, పిల్లలకు శిక్షణనిప్పిస్తున్న ప్రభవ నిర్వాహకురాలు చంద్రలత అభినందనీయురాలు.

## యూనివర్సిటీకి స్వయం ప్రతిపత్తి!

నెల్లూరులో కొత్తగా పెట్టిన విక్రమ సింహపురి యూనివర్సిటీకి స్వయం ప్రతిపత్తి హోదాను కల్పిస్తూ రాష్ట్ర ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేసింది. దీంతో గత 56 ఏళ్లుగా తిరుపతి కేంద్రంగా పనిచేస్తున్న ఎస్వీ యూనివర్సిటీ పరిధిలో వున్న జిల్లా పరిధిలోని అన్ని కళాశాలలు కొత్త యూనివర్సిటీ పరిధిలోకి వస్తాయి.

కొరవ 14వ పేజీలో

# ప్రైవేట్ కళాశాలలపై ప్రత్యేక ప్రేమ

- యూనివర్శిటీ, ఇంటర్ బోర్డు అధికారుల నిర్వాకం.

యూనివర్శిటీ, ఇంటర్ బోర్డు అధికారులకు ప్రైవేట్, కార్పొరేట్ కళాశాలల యాజమాన్యాలపై వున్న ప్రేమ గురించి అందరికీ తెలిసిందే. ప్రభుత్వ, ఎయిడెడ్ కళాశాలల కంటే కూడా ప్రైవేట్ కళాశాలల యాజమాన్యాల పట్ల స్వామిభక్తిని ప్రదర్శించేందుకు వర్శిటీ అధికారులు, బోర్డు అధికారులు ప్రయత్నించడం విమర్శలకు తావిస్తోంది. అధిక మార్కులు సాధించి యూనివర్శిటీ స్థాయిల్లో కళాశాల వారు పేరు ప్రఖ్యాతులు సాధించేందుకు అక్కడి అధికారులతో రహస్య ఒప్పందాలు చేసుకోవడం నగరంలోని పలు ప్రైవేట్ కళాశాలల యాజమాన్యాలకు రివాజుగా మారింది. డిగ్రీ పరీక్షల నిర్వహణకు ఎస్వీ యూనివర్శిటీ పాలకులు నిధుల కేటాయింపులో ప్రైవేట్ హవా కొట్టొచ్చినట్లు కన్పడుతోంది. ఆయా కళాశాలల్లో విద్యార్థుల సంఖ్యను బట్టి నిధులు కేటాయించాల్సి వుండగా దానిని ప్రక్కనపెట్టి తమ వారికి అధిక మొత్తంలో నిధులు కేటాయించడం విమర్శల పాలవుతుంది. ఇంటర్ పేపర్ లీక్‌చేస్తూ పట్టుబడ్డ కృష్ణ చైతన్య డిగ్రీ కళాశాలకు అధిక మొత్తంలో నిధులు కేటాయించారట. ఇక్కడ నుంచి 800 మంది విద్యార్థులు పరీక్షవ్రాస్తే 80 వేలు కేటాయించిన వర్శిటీ అధికారులు, 1300 మంది విద్యార్థులు పరీక్ష వ్రాసిన విఆర్ కళాశాలకు మాత్రం కేవలం 60 వేలే కేటాయించారట. డికె మహిళా కళాశాలకు 50వేలు కేటాయించడం అధికారులకు ప్రైవేట్ యాజమాన్యాలపై వున్న ప్రేమను తెలియజేస్తుంది.

## గ్రామసభల కళాజాతలో మైపాడు రాజా!

జిల్లావ్యాప్తంగా జరుగుతున్న గ్రామ సభల్లో ప్రభుత్వ పథకాలపై ప్రజలకు అవగాహన కల్పించేందుకు సమాచార శాఖ కళాజాతలను ఏర్పాటు చేసింది. ప్రముఖ మైమ్ ఆర్టిస్ట్ మైపాడు రాజా ఈ బృందాలకు ఇన్‌ఛార్జిగా వ్యవహరిస్తారు. కళాకారులు రాజా నేతృత్వంలో 46 మండలాల్లో ప్రభుత్వ పథకాల గూర్చి ప్రజలకు వివరిస్తారు. మైపాడురాజా విచిత్ర వేషధారణల్లో దేశవ్యాప్తంగా పేరుగాంచిన కళాకారుడు. ఇటీవలే మద్రాసు తెలుగు మహాసభ ఆయనకు ఉగాది పురస్కారం అందజేసింది. నటుడు పద్మనాభం స్మృత్యర్థం నెల్లూరు లాఫింగ్ క్లబ్ ఆయన్ను సన్మానించింది.

# కొత్త చేపల మార్కెట్ కంపు కంపు!



మార్కెట్‌లో డ్రమ్ముల్లో నీరు నిల్వ వుంచుకొని చేపలు శుభ్రపరుస్తున్న దృశ్యం.

నెల్లూరు డైకస్‌రోడ్డులో కొత్తగా ఏర్పాటుచేసిన చేపల మార్కెట్‌లో అశుభ్రత తాండవిస్తూంది. దీంతో మార్కెట్‌లో చేపలు, రొయ్యలు, మాంసం కొనుగోలు చేయను వెళ్లిన వ్యక్తులు ఆ అశుభ్రతలోనే వాటిని కొనుగోలు చేసి తెచ్చుకోవాల్సి వుంది. డైకస్‌రోడ్డులోని పాత చేపల మార్కెట్ స్థానంలో కొత్త మార్కెట్ కట్ట సంకల్పించి ఈ మార్కెట్‌ను విద్యుత్ సబ్‌స్టేషన్ ప్రక్కకు మార్చారు. అక్కడ కనీస సదుపాయాల కల్పనను మర్చిపోయారు. పాత చేపల మార్కెట్‌లో 24 గంటలపాటు మునిసిపల్ నీళ్లు వచ్చేవి. ఒక బోరు వుండేది. చేపలు, రొయ్యలు కొనుగోలు చేసినవాళ్లు వాటిని అక్కడే శుభ్రపరచుకొనే వాళ్లు.

## నీళ్ల సౌకర్యం అంతంత మాత్రం

తాత్కాలిక మార్కెట్‌లో తగినన్ని కొళాయిలు లేవు. బోరు లేదు. కొద్దిసేపు మాత్రమే వచ్చే నీటిని నిల్వచేసుకొని శుభ్రపరచడం వంటివి చేస్తుండడంతో మార్కెట్ మొత్తం కంపు కంపుగా తయారయ్యింది. చాలీచాలని నీటితో శుభ్రం చేసిన పొట్టేలు, మేకలు, కోళ్ల మాంసం ఇక్కడే మరో గత్యంతరం లేక కొనుగోలు చేయాల్సి వస్తుంది. చేపలు తోమే వ్యవహారాన్ని ఎంత తక్కువగా చెప్పుకొంటే అంత మేలని చెప్పవచ్చు. నెల్లూరు నగరంలోనే అతి పెద్ద చేపలు, మాంసం అమ్మే మార్కెట్‌లో సదుపాయాల కల్పన పట్ల కార్పొరేషన్ పాలకులు, అధికారులు ఇంత అశ్రద్ధ చూపించి ప్రజలను రోగగ్రస్తులను చేయడం తగునా? ఎండాకాలాన్ని దృష్టిలో పెట్టుకొని ఇక్కడ కనీసం ఓ బోరు ఏర్పాటుకు తక్షణ చర్యలు తీసుకోవాల్సిన అవసరం ఎంతైనా వుంది.

# పైపులైను వేశారు... కాని నీళ్లు రావు!



పైపులైను ప్రారంభోత్సవంలో మాట్లాడుతున్న మంత్రి రామనారాయణ రెడ్డి.

ఎంకి పెళ్లి సుబ్బి చావుకొచ్చినట్లుంది నెల్లూరు పొదలకూరురోడ్డులో నివాసం వుంటున్న వారి పరిస్థితి. పొదలకూరు రోడ్డులోని లేక్‌వ్యూ కాలనీ, లక్ష్మీ నరసింహపురం, గౌతమ్‌నగర్, పద్మావతి సెంటర్, నేతాజీ నగర్, వెంగళరావు నగర్ ప్రాంతీయులు మునిసిపల్ నీటికి కటకటలాడుతున్నారన్న ఉద్దేశ్యంతో కొత్త పైపులైను పనులు చేపట్టారు. వీటిని మూడు నెలల క్రితం చేపట్టి గతవారం మునిసిపల్ మంత్రి రామనారాయణరెడ్డి చేత ప్రారంభింపజేశారు. ఈ సందర్భంగా ఏర్పాటుచేసిన సభలో ఇక ఈ ప్రాంతీయులకు రోజు ఒకటిన్నర గంట నిరాటంకంగా నీళ్లు సరఫరా చేస్తామని నేతలు ఘనంగా ప్రకటించారు. ఈ పైపులైనుకు టెస్టింగ్ కోసం నీరు వదలినప్పటి నుంచి కనీసం 50 చోట్ల పైపులైన్లు బద్దలయ్యాయి. ప్రతిరోజు ఏదో ఒక ప్రాంతంలో రిపేరు పూర్తి కావడం, మరో ప్రాంతంలో పగిలిపోవడం జరుగుతుంది. దీంతో పొదలకూరురోడ్డులోని చాలా అడ్డరోడ్లల్లో 20 రోజులకు పైగా మునిసిపల్ కొళాయిల్లో నీళ్లు రావడం లేదు. దీంతో ఈ ప్రాంతీయులు అల్లాడి పోతున్నారు. ఒకవేళ ఎక్కడైనా నీళ్లు వచ్చినా అవన్నీ ఎర్రమట్టి నీళ్లే. పొదలకూరు రోడ్డులోని పాత మంచినీటి పైపులైనును సరిగ్గా వేయను గతంలో మన మునిసిపల్ ఇంజనీర్లు విఫలమయ్యారు. కొత్తలైను వ్యవహారంలోనూ అదే బాటన నడిచారు. సరికొత్త పరిజ్ఞానం, ఆధునీకరణ యంత్రాలు అందుబాటులోకి వచ్చినా మంచినీటి పైపులైనును పగిలిపోకుండా వేసే సాంకేతిక పరిజ్ఞానాన్ని మన ఇంజనీర్లు నేర్చుకోకపోవడం దారుణం కాక మరేమిటి?

# రాజీవ్‌భవన్ నేతృత్వంలో మంచినీటి ట్యాంకర్!



సిద్ధమైన వాటర్ ట్యాంకర్.

నగర వాసుల కష్టాలు తీర్చేందుకు వారికి తన వంతు సేవ చేసేందుకు రాజీవ్‌భవన్ మరో అడుగు ముందుకేసింది. వేసవిలో నగర ప్రజలు ఎదుర్కొనే మంచినీటి ఎద్దడిని ఎదుర్కొనేందుకు, దాహార్తిని తీర్చేందుకు సొంత నిధులు వెచ్చించి మంచినీటి ట్యాంకర్‌ను కొనుగోలుచేసి ప్రజలకు అందుబాటులోకి తెచ్చారు. దీనికోసం రాజీవ్‌భవన్ నేతలు మూడు లక్షల రూపాయలు వెచ్చించి 14వేల లీటర్ల కెపాసిటీ గల ట్యాంకర్‌ను నీటి సరఫరాకు కొనుగోలు చేశారు. ఈ సందర్భంగా కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి మాట్లాడుతూ అప్పుడే నగరంలో మంచినీటి సమస్యతో ప్రజలు అల్లాడిపోతున్నారని తెలిపారు. ప్రజల సమస్యలు పట్టించుకోవాల్సిన మునిసిపల్ పాలకులు, ప్రజాప్రతినిధులు దానిని విస్మరించడంతో ప్రజలకు కష్టాలు తప్పడం లేదన్నారు. దీనిని దృష్టిలో వుంచుకొని నగర వాసులకు మంచినీటిని అందించేందుకు ట్యాంకర్ ద్వారా నీటిని సరఫరా చేయనున్నట్లు తెలియజేశారు. 984 89 92225 అనే ఫోన్ నెంబర్‌కు సమాచారం అందిస్తే ఏ ప్రాంతం వారికైనా మంచినీటిని సరఫరా చేస్తామని శ్రీధర్‌రెడ్డి చెప్పారు. డాక్టర్ అనిల్, రూప్‌కుమార్, వెంకటేశ్వర్లు, మదన్‌మోహన్‌లు వాటర్ ట్యాంకర్ కొనుగోలు ఉద్దేశ్యాన్ని వివరించారు.

# నకిలీ పోలీసుల నగల దగా

## మహిళలూ జరజాగ్రత్త!

నెల్లూరు టౌన్‌లో నకిలీ పోలీసుల నగల దగా రివాజైపోయింది. అమాయక మహిళలను బురిడీ కొట్టించడంలో ఈ బడా చోరుల హస్తలాఘవం అంతాఇంతా కాదు. విజయమహల్‌గేటు, మినీబైపాస్, ఆత్మకూరు బస్టాండ్ ప్రాంతాలలో ఈ నకిలీ పోలీసులు తరచూ తారసపడుతున్నారు. పోలీస్ యూనిఫారాన్ని తలపించే దుస్తులతో దారినపోయే మహిళలను పలకరిస్తారు. టౌన్‌లో దొంగల బెడద ఎక్కువగా వుంది కాబట్టి మెడలోని నగలుతీసి భద్రం చేయాలని హెచ్చరిస్తారు. వారే చొరవచూపి నగలు తీయించి, ఒక కాగితంలో చుట్టి చేతికిస్తారు. వారి హస్తలాఘవ ప్రావీణ్యమంతా ఇక్కడే ప్రదర్శితమౌతుంది. కళ్లముందు నగలు కాగితంలో పెట్టినట్లే కన్పిస్తుంది. కానీ అందులో నగల స్థానంలో రాళ్లు, రప్పలుంటాయి. ఈ దగా తెలుసుకొనే లోపలేవారు మాయమైపోతారు. ఆ తర్వాత లబోదిబోమనడం తప్ప ఆ మహిళలు చేయగల్గింది ఏదీ వుండదు. ఇప్పటికి ఆరేడుసార్లు ఈ దోపిడీ జరిగినా అసలు పోలీసులు నకిలీ పోలీసులను పట్టుకోలేక పోతున్నారు. పోలీసులను నమ్ముకొనేకంటే మహిళలే ఇటువంటి దగాకోరుల పట్ల జాగ్రత్తగా మసలు కోవడం మంచిది.



తిరుమలలో నెల్లూరు పారిశ్రామికవేత్త వేమిరెడ్డి ప్రభాకర్‌రెడ్డి కట్టిన అతిథి గృహాన్ని ప్రారంభిస్తున్న శాసనమండలి ఛైర్మన్ చక్రపాణి. ప్రక్కన టిటిడి ఛైర్మన్ ఆదికేశవులు నాయుడు, రాష్ట్ర అటవీ మంత్రి రామచంద్రారెడ్డి, కర్ణాటక మంత్రి గాలి కరుణాకర్‌రెడ్డి వున్నారు. ఇన్‌సెట్‌లో అతిథిగృహం.

# నెల్లూరు సన్నాలపై... నల్లమచ్చ సాకుగా దగా!

దేశానికి అన్నం పెట్టే రైతన్నకు కష్టాలు మొదలయ్యాయి. వరి పంటకు కనీస గిట్టుబాటు ధర కల్పించే విషయంలో రైసుమిల్లర్లు, వ్యాపారులు, దళారులు అన్నివిధాలుగా దగా చేస్తున్నారు. రైతు ప్రభుత్వాలుగా ప్రకటించుకుంటున్న కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు సైతం రైతులపై వివక్ష చూపుతున్నాయి. గిట్టుబాటు ధర విషయంలో అధికారులు, ప్రజాప్రతినిధులు కూడా పొంతన లేని ప్రకటనలతో రైతులను మోసం చేస్తున్నారు. ప్రకృతి వైపరీత్యాలను తట్టుకుని, ప్రభుత్వం సహకారం అందించినా అందించకపోయినా బయట అప్పులు చేసి వరిపంట పండించిన రైతులకు చివరకు నిరాశే మిగిలింది.



రోడ్డు ప్రక్కన ఆరబోసిన నల్లమచ్చ సోకిన నెల్లూరు సన్నాలు ధాన్యాన్ని అక్కడే తెగనమ్మేస్తున్న రైతులు.

## గిట్టుబాటు ధరేది?

విత్తనాలు కొనుగోలు దగ్గర నుంచి రసాయనిక ఎరువుల వాడకం వరకు వివిధరకాలుగా రైతులు అప్పులు చేసి శ్రమించి పండించిన వరి పంటకు సరైన గిట్టుబాటు ధర కల్పించడంతో కేంద్ర ప్రభుత్వం పూర్తిగా వైఫల్యం చెందింది. వారం రోజుల క్రితం కేంద్రప్రభుత్వం కనీస మద్దతు ధర కల్పిస్తామని ప్రకటించినా కూడా వ్యాపారులు, రైస్‌మిల్లర్లు కొనుగోలు చేసేందుకు ముందుకు రాకపోవడంతో ఎక్కడ ధాన్యం అక్కడే పొలాల్లోని కల్లాల్లో నిలబడి పోయింది. రాష్ట్రవ్యాప్తంగా ఎంతో ప్రసిద్ధి గాంచిన నెల్లూరు సన్నాలు 34449 రకం ధాన్యంపై కొద్దిపాటి నల్లమచ్చ ఏర్పడింది. ఈ మచ్చను సాకుగా చూపి ధాన్యం కొనుగోలు చేసేందుకు ససేమిరా అంటున్నారు వ్యాపారులు.

ఎంతో శ్రమించి పండించిన వరి పంటకు కనీస మద్దతు ధర లేకపోవడంతో రైతాంగం కృంగిపోతోంది. జిల్లావ్యాప్తంగా నెల్లూరు సన్నాల రకం వేసేందుకు వ్యవసాయశాఖ అధికారులు, శాస్త్రవేత్తలు విస్తృత ప్రచారం నిర్వహించారు. గ్రామీణ ప్రాంతాలలో నిర్వహించిన వ్యవసాయ సదస్సులు, మండల సమావేశాల్లో నెల్లూరు సన్నాలు రకం వరిపంట వేస్తే రైతులకు అధిక దిగుబడులు వుంటాయని గతంలో ప్రకటించి వున్నారు. అధికారుల మాటలను నమ్మిన రైతులు 34449 రకం వరి విత్తనాలను కొనుగోలు చేసి జిల్లావ్యాప్తంగా దాదాపు లక్షా 50 వేల ఎకరాలకు పైగా పంటను వేయడం జరిగింది.

ముందుగా వేసిన రైతులు మార్చి చివరి వారంలో వరికోతలు కోశారు. ధాన్యాన్ని కొనుగోలు చేసేందుకు వచ్చిన వ్యాపారులు, దళారులు, బియ్యంపై నల్లమచ్చ వుందంటూ కొనుగోలు చేసేందుకు నిరాకరించారు. ఈ విషయం జిల్లా వ్యాప్తంగా ప్రచారం కావడంతో కోతకోసిన ధాన్యం పొలాల్లోనే నిలిచి పోవాల్సిన దుస్థితి ఏర్పడింది. ధాన్యం కొనుగోలుకు ముందుకు రాని విషయాన్ని అధికారులు, ప్రజాప్రతినిధుల దృష్టికి రైతులు తీసుకువెళ్లినా న్యాయం జరగకపోవడంతో రైతులు తీవ్ర ఆందోళన చెందుతున్నారు. వాస్తవానికి రైతులు పండించిన ధాన్యాన్ని భారత ఆహార సంస్థ ఆధ్వర్యంలో కొనుగోలు చేయాల్సి వుంటుంది.

బియ్యంలో ఏర్పడిన నల్లమచ్చ నాలుగు శాతం వరకు వుంటే కొనుగోలుకు ఎటువంటి అభ్యంతరం వుండదని ఎఫ్‌సిఐ అధికారులు అభిప్రాయపడుతున్నారు. నెల్లూరు జిల్లాలో మాత్రం అయిదు నుంచి ఆరుశాతం వరకు ధాన్యంలో నల్లమచ్చ వుంటుందని దీంతో కొనుగోలు చేసేందుకు వీలులేదని వ్యాఖ్యానిస్తున్నారు. భారత ఆహారసంస్థ అధికారులు నల్లమచ్చ ఏర్పడిన ధాన్యాన్ని కొనుగోలుకు ముందుకు రాకపోగా తక్కువ ధరకు కొనుగోలు చేయమని రైస్‌మిల్లర్లకు సలహా ఇస్తున్నారన్న ఆరోపణలు బలంగా వినిపిస్తున్నాయి.

## అధికారుల నిర్వాకం

రైతులు పండించిన ధాన్యానికి కనీస మద్దతు ధర కల్పించడంలో అధికారులు నిర్లక్ష్యం ప్రదర్శిస్తున్నారు. గతంలో ధాన్యాన్ని భారత ఆహారసంస్థ అధికారులు కొనుగోలు చేసేవారు. ప్రస్తుతం ఈ అధికారులు నల్లమచ్చ ఏర్పడిన ధాన్యాన్ని కొనుగోలు చేసేందుకు అనేక కారణాలు చూపుతున్నారు. ఎఫ్‌సిఐ అధికారులు రైతులు పండించిన ధాన్యాన్ని కొనుగోలు చేస్తే క్వింటాల్‌కు 950 రూపాయల నుంచి 1030 రూపాయల వరకు చెల్లిస్తారు. ఈ విధంగా పుట్టి ధాన్యానికి 9వేల 500నుంచి 10 వేల 500రూపాయలకు పైగా రైతుకు వచ్చే అవకాశం వుంటుంది. ప్రస్తుతం అధికారులు రైతులు పండించిన ధాన్యం వైపు కన్నెత్తి కూడా చూడడం లేదు. వరికోత కోసుకున్న రైతులు ఎక్కువ రోజులు ధాన్యాన్ని నిల్వ చేసుకోలేక ఏదోఒక ధరకు కొనుగోలు చేయమని దళారులకు వెంటబడి అభ్యర్థిస్తున్నారు.

> “ జిల్లా రైతులు మంచి మార్కెట్ వుంటుందని ఆరుగాలం శ్రమించి పండించిన నాజూకైన ధాన్యం నెల్లూరు సన్నాలపై నల్లమచ్చ తెగులు సోకడంతో మద్దతు ధరలేక విలవిలలాడిపోతున్నారు. ”

రైతులు అవసరాలను అవకాశంగా తీసుకున్న దళారులు వ్యాపారులను ఒప్పించి తక్కువ ధరకు కొనుగోలు చేసే పనిలో నిమగ్నమై వున్నారు. నల్లమచ్చ వున్న నెల్లూరు సన్నాలు ధాన్యాన్ని పుట్టి 7,400 రూపాయలకు కొనుగోలు చేస్తున్నారు. రైతుల నుంచి ధాన్యం తీసుకునే క్రమంలో కొలతల్లో కూడా చాలా వ్యత్యాసం వుంటుంది. క్వింటాల్‌కు అయిదు కిలోల వంతున అదనంగా తీసుకుంటున్నారని కొందరు రైతులు వాపోతున్నారు. ఇదేమిటని ప్రశ్నిస్తే ధాన్యంలో తడి అధికంగా వుందని, తూకం వేసే సమయంలో తాము నష్టపోకుండా వుండాలంటే ఇలా చేయకతప్పదని దళారులు అంటున్నారు.

## రైతులకు దొరకని గోదాములు

పండించిన ధాన్యాన్ని నిల్వ చేసుకొనేందుకు గోదాములు కూడా రైతులకు అందుబాటులో లేకుండా పోయాయి. వరికి గిట్టుబాటు ధర లేకపోవడం కారణంగా కొద్దిరోజుల పాటు ధాన్యాన్ని నిల్వ చేసుకోవాలని భావించే రైతులకు చుక్కెదురవుతుంది. మార్కెటింగ్‌శాఖ గోదాములు, ఎఫ్‌సిఐ గోదాములు ఖాళీగా లేవని సమాధానం వస్తుంది. వాటిని ముందుగానే అధికారులు, వ్యాపారులు, రైస్ మిల్లర్లకు అద్దెకు ఇచ్చేశారు. ఈ విషయంలో కూడా అధికారులు రైతులను దగా చేస్తున్నారు. గోదాములు ఖాళీగా లేకపోవడం కూడా రైతుల పాలిట శాపంగా పరిణమించింది. మార్కెటింగ్‌శాఖ అధికారులు రైస్‌మిల్లర్లు, వ్యాపారులతో కుమ్మక్కై రైతులకు గోదాములు అద్దెకు దొరక్కుండా చేశారని ఆరోపణలు వున్నాయి. ఈ కారణంగా రైతులు ఆర్థికంగా ఎంతో నష్టపోవాల్సిన పరిస్థితి తలెత్తింది.

ప్రభుత్వం నల్లమచ్చ ఏర్పడిన ధాన్యానికి మద్దతు ధర కల్పించాలని రైస్‌మిల్లర్లను ఆదేశించినప్పటికి వారిలో ఇప్పటివరకు ఎటువంటి స్పందన కానరావడం లేదు. 34449 రకం వరిపంటను వేసుకోమని తొలుత ప్రచారం నిర్వహించిన వ్యవసాయశాఖ అధికారులు, శాస్త్రవేత్తలు ఇప్పుడు రైతులు పడుతున్న ఇబ్బందుల గూర్చి మాట్లాడకపోవడం గమనార్హం. అసలు బియ్యంలో నల్లమచ్చ ఎందుకు ఏర్పడుతుందన్న దానిపై పూర్తి వివరాలు చెప్పేందుకు శాస్త్రవేత్తలు అందుబాటులో లేకుండా పోతున్నారు.

మొత్తం మీద జిల్లావ్యాప్తంగా నెల్లూరు సన్నాల రకం ధాన్యంలో ఏర్పడిన నల్లమచ్చ రైతుల ఆర్థిక పరిస్థితులను చిన్నాభిన్నం చేస్తుంది. పండించిన ధాన్యాన్ని సకాలంలో అమ్ముకోలేక పోవడం వలన చేసిన అప్పులు ఎలా తీర్చాలని చిన్న, సన్నకారు రైతులు తలలు పట్టుకొంటున్నారు.

# కావలిలో అక్రమ రిజిస్ట్రేషన్లు!

- ఫోటోలు, డాక్యుమెంట్లు మార్చేసే ముఠా ఒకటుంది

కావలి ప్రాంతంలో అక్రమ రిజిస్ట్రేషన్‌లు కొనుగోలు దారులను హడలెత్తిస్తున్నాయి. ఏ స్థలం ఎంత మందికి అమ్మారో, ఎవరికి ఎవరు అమ్మారో తెలియక అటు స్థలం యజమానులు, ఇటు స్థలాన్ని కొనుగోలు చేసేవారు అయోమయానికి గురికావాల్సి వస్తోంది. భూముల ధరలకు రెక్కలు రావడంతో అక్రమ రిజిస్ట్రేషన్‌లు ఎక్కువయ్యాయి. యజమానులకు తెలియకుండానే ఇద్దరి ముగ్గురి చేతులు మారిపోతున్నాయి. చనిపోయిన వారి పేర్లు, ఫోటోలను మార్చి తప్పుడు ఫోటోలతో మోసాలకు పాల్పడుతున్నారు. ఇటీవల ఇలాంటి అక్రమ రిజిస్ట్రేషన్ వ్యవహారం బట్టబయలు కావడంతో అసలు విషయం వెలుగు చూసింది. బోగోలు మండలం తాళ్లూరు గ్రామానికి చెందిన చినబాబు అనే వ్యక్తి సెంకడరీ గ్రేడ్ ఉపాధ్యాయుడిగా పని చేసేవాడు. 1999లో స్థలాన్ని కృష్ణారెడ్డి అనే వ్యక్తి వద్ద కొన్నాడు. తర్వాత చినబాబు మరణించాడు. ఆయన భార్యకు 2000 సంవత్సరంలో రికార్డు అసిస్టెంట్‌గా ఉద్యోగం లభించింది. ఇటీవల ఆమె స్థలాన్ని అమ్మాలని భావించి రిజిస్ట్రార్ కార్యాలయానికి వచ్చి పత్రాలను పరిశీలించగా ఆ స్థలాన్ని 2006వ సంవత్సరంలో తన భర్త అమ్మినట్టుగా వుండడం చూసి రిజిస్ట్రార్‌కు ఫిర్యాదు చేయడంతో కలకలం రేగింది. ఇలాంటి మోసాలు ఇటీవల కాలంలో కావలి ప్రాంతంలో అధికం కావడంతో అటు స్థల యజమానులు, ఇటు కొనుగోలుదారులు హడలిపోతున్నారు.



నెల్లూరీయుడు హైదరాబాద్‌లో ప్రముఖ న్యాయవాదిగా పేరు తెచ్చుకొన్న రాజగోపాలరెడ్డి న్యాయవాద వృత్తిలో 50ఏళ్లు పూర్తిచేసుకొన్న సందర్భంగా సన్మానిస్తున్న హైకోర్టు జడ్జి గులాం మహమ్మద్.

# బత్తాయి రైతుల వెతలు!

ఉదయగిరి ప్రాంతంలో చేపట్టిన బత్తాయి సాగు రైతులకు నష్టాన్ని మిగిలిస్తోంది. 12వేల హెక్టార్లలో బత్తాయి, నిమ్మసాగు చేపట్టారు. ఆశించిన మేర ధరలు రాకపోవడంతో రైతులు ఆందోళన చెందుతున్నారు. కోత కోయకుండా చెట్లకే కాయలను వదిలివేయడంతో అవి పండి రాలిపోతున్నాయి. భూగర్భజలాలపై ఆధార పడి బత్తాయిసాగు చేస్తున్నారు రైతులు. వరికుంటపాడు మండలంలోని రామాపురం, కాంచెరువు, కాకొల్లువారిపల్లి, తూర్పురొంపిదొడ్ల, మహ్మదాపురం, విరువూరు, కృష్ణం

### ధరలేక విలవిల

రాజుపల్లి, జడదేవి, గువ్వడి, నారసింహపురం, వరికుంటపాడు తదితర గ్రామాల్లో ఈ పంటను ఎక్కువగా పండిస్తున్నారు. ఎండలు తీవ్రం కావడంతో భూగర్భజలాలు అడుగంటి బోర్లకు నీరు అందక రైతులు ఇబ్బందులు పడుతున్నారు. వేలాది ఎకరాల్లో బత్తాయి సాగవుతున్న ఈ ప్రాంతంలో ప్రాసెసింగ్ యూనిట్ గానీ, కోల్డ్‌స్టోరేజ్‌గాని లేక పోవడంతో ఆ రోజు పలికిన ధరకే పంటను అమ్ముకోవాల్సిన పరిస్థితి ఏర్పడిందని రైతులు వాపోతున్నారు. గిట్టుబాటు ధర లభించక అప్పులపాలవుతున్నామని రైతులు ఆక్రోశిస్తున్నారు.

# అకాల వర్షంతో ఖేదం!

### రాపూరు రైతుల లబోదిబో

ఇటీవల కురిసిన అకాల వర్షం రైతాంగాన్ని తీవ్రంగా నష్టపరిచింది. రాపూరు ప్రాంతంలో కురిసిన కుండపోత వర్షం కారణంగా పంట చేతికొచ్చే దశలో నీట మునగడంతో రైతులు విలవిల్లాడిపోయారు. రాపూరు పట్టణంలోని చెరువుల క్రింద వేసిన వరిపంట నీట మునిగిపోయింది. యంత్రాలతో కోతలు చేస్తుండగా ధాన్యం తడిసి ముద్దయ్యింది. దీంతో పలుచోట్ల ధాన్యాన్ని పట్టలు కప్పి తడిసిపోకుండా కాపాడుకొనేందుకు రైతులు అవస్థలుపడ్డారు. అకాల వర్షంతో తీవ్ర నష్టం వాటిల్లి నట్లు రైతులు గగ్గోలు పెడుతున్నారు. పంట పొలాల్లో గట్లను తెగ్గొట్టి నీటిని బయటకు పంపేందుకు చర్యలు చేపట్టారు. సాయంత్రం 4 గంటలకు నుంచి ఒక్క గంటపాటు కురిసిన వర్షంతో జనం ఒక్కసారిగా భయాందోళనలకు గురయ్యారు. విద్యుత్ స్థంభం కూలిపోవడంతో గ్రామాల్లో విద్యుత్ సరఫరా నిలిచిపోయింది. వర్షంతో రహదారులు అన్నీ కాలువలను తలపించాయి. లోతట్టు ప్రాంతాలు జలమయం కావడంతో పాటు పలుచోట్ల చెట్లు విరిగిపడడంతో అకాల వర్షం ప్రజలను తత్తరపాటుకు గురి చేసింది.

## కలువాయిలో టీచర్ల అక్రమాలు

కంచే చేను మేసిన చందంగా వ్యవహరించారు కలువాయి ప్రభుత్వ పాఠశాలల ఉపాధ్యాయులు. ఇటీవల ముగిసిన పరీక్షల్లో వీరు ఇన్విజిలేషన్ డ్యూటీల నుంచి చీఫ్ సూపరింటెండెంట్లు, సిట్టింగ్ స్క్వాడ్‌ల వరకు అందరూ ప్రైవేట్ స్కూళ్లకు లబ్ధిచేకూర్చేలా వ్యవహరించడం చర్చనీయాంశమైంది. కొందరు సెల్‌ఫోన్‌లను వుపయోగించి ప్రైవేట్ స్కూళ్ల విద్యార్థులకు సమాధానాలు చెప్పించడం బహిరంగంగా జరిగిందట. మరికొందరు ప్రభుత్వ పాఠశాలల టీచర్లు ఆయా పాఠశాలల విద్యార్థుల వద్ద నుంచి అధిక మార్కులు వేయిస్తామని డబ్బులు వసూలు చేయడం వీరి అవినీతికి అద్దం పడుతోంది. ఇలాంటి అక్రమార్కుల వలన నిజమైన విద్యార్థులకు అన్యాయం జరిగి వారు నష్టపోయేందుకు కారణం అవుతున్నారని పలువురు విద్యార్థుల తల్లిదండ్రులు వ్యాఖ్యానిస్తున్నారు.



దోమకాటు వల్ల వచ్చే వ్యాధుల పట్ల అప్రమత్తంగా వుండాలని నెల్లూరు నగర జనాన్ని కరపత్రాల ద్వారా చైతన్యపరుస్తున్న ప్రజారాజ్యం పార్టీ నాయకుడు ఖాజామొహిద్దీన్.



నెల్లూరు సర్వోదయ కాలేజి స్థాపకుడు వాకాటి సంజీవశెట్టి 102వ జయంతి సందర్భంగా కాలేజి ప్రాంగణంలోని ఆయన విగ్రహం వద్ద పూలమాలలు వేసి నివాళులర్పిస్తున్న వైశ్య ప్రముఖులు కెవి.చలమయ్య, కారంశెట్టి వెంకటరామయ్య, కొండపల్లి సుబ్రహ్మణ్యం, ఎండోమెంట్ అసిస్టెంట్ కమిషనర్ జి.మహేశ్వర్‌రెడ్డి.

# ఆలయ భద్రత అమ్మవారు చూడాల్సిందే!

## జొన్నవాడలో మూలనపడేసిన మెటల్ డిటెక్టర్‌లు

భక్తులకు భద్రత కల్పించేందుకు ఏర్పాటుచేసిన మెటల్ డిటెక్టర్‌లు పాడైపోయి మూలనపడి వుండడం బుచ్చిరెడ్డిపాలెం మండలంలోని జొన్నవాడ పుణ్యక్షేత్రంలో చోటు చేసుకొంది. జొన్నవాడ కామాక్షితాయి ఆలయానికి, భక్తులకు రక్షణ కల్పించే ఉద్దేశ్యంతో లక్షలరూపాయల వ్యయం చేసి కామాక్షితాయి, మల్లికార్జునుడి ఆలయాల్లో రెండు మెటల్ డిటెక్టర్లను ఏర్పాటు చేశారు. కొద్దికాలం వీటిని నిర్వహించిన తర్వాత దారికి అడ్డంగా వున్నాయన్న సాకుతో మూలనపడేశారు. నిఘా వర్గాలు ముందు జాగ్రత్తతో ఏర్పాటుచేసిన మెటల్ డిటెక్టర్లు మూలనపడడం విస్మయం కల్గిస్తోంది. మూడేళ్ల క్రిందట ఏర్పాటుచేసిన వీటిని వినియోగించేందుకు తగిన ఉద్యోగులు లేరని చెప్పడం అధికారులు, ఆలయకమిటి నిర్లక్ష్యానికి అద్దం పడుతోంది. సాంకేతిక కారణాలు చూపి డిటెక్టర్లను ప్రక్కన పెట్టడంతో ఆలయ రక్షణ ప్రశ్నార్థకం అవుతోందని పలువురు వ్యాఖ్యానిస్తున్నారు. అధికారులు మాత్రం దీనిపై స్పందిస్తూ మెటల్ డిటెక్టర్ల నిర్వహణ ఖర్చుతో కూడుకున్నందున ప్రక్కన వుంచామని ఆలయ రక్షణ అమ్మవారే చూసుకొంటుందని చెప్పడం పట్ల భక్తులు తీవ్ర ఆగ్రహం వ్యక్తం చేస్తున్నారు.

# మధ్యాహ్న భోజన ఏజన్సీల కష్టాలు!

### ఆరు నెలలుగా బిల్లులు లేవు

సరైన వసతులు లేక ఒక వైపు, బిల్లులు రాక మరోవైపు మధ్యాహ్న భోజన నిర్వాహకులు తీవ్ర ఇబ్బందులు పడుతున్నారు. జిల్లావ్యాప్తంగా మధ్యాహ్న భోజన ఏజన్సీలది ఇదే పరిస్థితి. ముత్తుకూరు మండలంలో పరిశీలించినట్లయితే నిర్వాహకులు పడుతున్న బాధలు అవగతమవుతాయి. మొత్తం 76పాఠశాలల్లో మధ్యాహ్న భోజన పథకం అమలవుతోంది. విద్యార్థులకు భోజనాన్ని అందించేందుకు ఏజెన్సీలు నానాతంటాలు పడాల్సివస్తోంది. ఆరు నెలలుగా బిల్లులు రాకపోవడం, పెరిగిన వస్తువుల ధరల నేపథ్యంలో పసిపిల్లలకు భోజనం పెట్టాలంటే అప్పుచేయాల్సి వస్తున్నదని వారు వాపోతున్నారు. నెలనెలా అందజేయాల్సిన బిల్లులు కొన్ని నెలలుగా రాకపోవడంతో విద్యార్థులను పస్తుపెట్టలేక తమకు చేతనైన మేర ఆహారాన్ని అందిస్తున్నామని అధికారులు తమ బాధలను అర్థం చేసుకొని బిల్లు చెల్లింపులు సక్రమంగా జరపాలని, భోజనం తయారీకి తగిన సౌకర్యాలు కల్పించాలని వారు కోరుతున్నారు.



ధరల పెరుగుదలను నిరసిస్తూ నెల్లూరు కలెక్టరేట్ వద్ద వామపక్షాలు నిర్వహించిన ధర్నా.




నెల్లూరు పోలీసు అతిథి గృహం వద్ద మీడియాతో మాట్లాడుతున్న నటుడు మోహన్‌బాబు. ప్రక్కన దర్శకేంద్రుడు కె. రాఘవేంద్రరావు.

# సబ్సిడీపై వరినాటే, కోసే యంత్రాలు!

## రైతుమిత్ర గ్రూపులకు తాయిలం

జిల్లాలో సక్రమంగా పనిచేస్తున్న రైతుమిత్ర గ్రూపులకు సబ్సిడీపై వరినాటే యంత్రాలు, వరికోత యంత్రాలను అందజేస్తామని వ్యవసాయశాఖ సంయుక్త సంచాలకులు బాలయ్య తెలిపారు. కోవూరులో జరిగిన ఒక కార్యక్రమంలో పాల్గొన్న ఆయన సబ్సిడీ తదితర అంశాలపై మాట్లాడారు. ఈ ఆర్థిక సంవత్సరంలో జిల్లాకు పది వరికోత యంత్రాలు, మూడు వరి నాటు యంత్రాలను రైతుమిత్ర గ్రూపులకు 50శాతం సబ్సిడీతో అందజేసేందుకు ప్రణాళికలు సిద్ధం చేసినట్లు వివరించారు. గతంలో జిల్లాలో 7621 రైతుమిత్ర గ్రూపులు వుండగా, వీటిలో 56గ్రూపులు మాత్రమే ప్రస్తుతం సక్రమంగా పని చేస్తున్నాయని తెలిపారు. ఈ గ్రూపులలో రైతులకు ఉపయోగపడుతున్న గ్రూపులను గుర్తించి పది లక్షల రూపాయలను సబ్సిడీ క్రింద చెల్లిస్తున్నట్లు వివరించారు. ఈ సబ్సిడీ మొత్తాన్ని వ్యవసాయశాఖ భరిస్తుందని, మిగిలిన 50శాతంలో 10శాతం రైతుమిత్ర గ్రూపులు, 40 శాతం బ్యాంకుల ద్వారా రుణాలు అందిస్తారని చెప్పారు. రైతుమిత్ర గ్రూపులకు ఈ యంత్రాలపై అవగాహన కల్పించేందుకు త్వరలో శిక్షణా తరగతులను నిర్వహించనున్నట్లు తెలిపారు.

## మేనకూరు సెజ్‌కు ప్రభుత్వ సేవలు

● ఫ్లైఓవర్, అండర్‌గ్రౌండ్ బ్రిడ్జిల నిర్మాణానికి నిధులు

నాయుడుపేట మండల పరిధిలోని మేనకూరు ఆర్థిక మండలిలో ఏర్పాటు చేస్తున్న పరిశ్రమల కోసం 75 కోట్ల రూపాయలతో ఫ్లైఓవర్ బ్రిడ్జిలు, అండర్ బ్రిడ్జిలను, నాలుగు లైన్ల రహదారులను నిర్మిస్తున్నట్లు ఆర్ అండ్ బి ఎస్ఇ విజయకుమార్ తెలిపారు. వివిధ నిర్మాణాల కోసం స్థల పరిశీలన జరిపేందుకు వచ్చిన ఆయన మాట్లాడుతూ ఎపిఐఐసి వారి నివేదిక ప్రకారం ఈ మొత్తాన్ని ప్రభుత్వం మంజూరు చేసినట్లు చెప్పారు. నాయుడుపేట నుంచి మేనకూరు వరకు నాలుగులైన్ల రోడ్ల నిర్మాణంతోపాటు పలుచోట్ల బ్రిడ్జిలు, ఫ్లైఓవర్‌లు, పాల్వారు, మేనకూరు వద్ద అండర్ బ్రిడ్జిలు ఏర్పాటవుతాయన్నారు. మేనకూరు సెజ్‌లో ఫ్రైమ్‌టైమ్ ఎలక్ట్రికల్ సంస్థతోపాటు ఈ మెయిర్, గ్రీన్‌టెక్ తదితర భారీ పరిశ్రమలు నిర్మాణం కానున్నాయని దీనిని దృష్టిలో వుంచుకొని సెజ్‌లో మౌలిక సదుపాయాలను ఏర్పాటుచేసేందుకు ఈ నిర్మాణాలను చేపడుతున్నట్లు వివరించారు.

## బాబు, చిరు ఢీ అంటే ఢీ



చంద్రబాబుకు, చిరంజీవికి మధ్య పచ్చగడ్డి వేస్తే భగ్గుమంటోంది. గత ఎన్నికల్లో 'చిరు' మూలంగా తెలుగుదేశం తీవ్రంగా నష్టపోయిందని 'బాబు' గుర్రుగా వున్నాడు. తెలుగుదేశం సీనియర్లయిన విద్యాధరరావు, సుబ్బారాయుడు వంటి వారంతా 'చిరు' పార్టీలో చేరడం కూడా బాబుకు నచ్చడం లేదు. అయిందేదో అయింది. తిరిగి తెదేపాలోకి వచ్చేయండి అంటూ 'బాబు' వారికి కబురు పెడుతున్నాడట. దీంతో 'చిరు' కస్సుబుస్సుమంటూ 'బాబు'పై మండిపడుతున్నాడు. ఇది ఇలా వుండగా కాంగ్రెస్‌పార్టీ నాయకులు 'చిరు'ను తమ పార్టీలోకి ఆహ్వానిస్తున్నారు. 'చిరు' మాత్రం ప్రస్తుతానికి విడిగానే వుంటానంటున్నాడు. చంద్రబాబు మాత్రం సమయం, సందర్భం చిక్కినప్పుడల్లా చిరును లక్ష్యంగా చేసుకొని విమర్శిస్తున్నాడు. చిరు, బాబు పరస్పర విమర్శల్ని కాంగ్రెస్ నాయకులు బాగా ఎంజాయ్ చేస్తున్నారు.

## గవర్నర్ ఆశ్చర్యం



రాష్ట్ర ఆదాయంలో సింహ భాగం తాగుబోతుల ద్వారానే రావడం పట్ల గవర్నర్ నరసింహన్ ఆశ్చర్యం వెలిబుచ్చారు. సాక్షాత్తు గవర్నర్‌కే ఇటువంటి సందేహం రావడంతో ప్రభుత్వం ఇర కాటంలో పడింది. జనాల్ని తాగించి తద్వారా వచ్చే ఆదాయంతో సంక్షేమ పథకాల్ని అమలు చేయడం అన్యాయమంటూ గవర్నర్ చెప్పడంతో ప్రభుత్వ యంత్రాంగం ఒక్కసారిగా విస్తుపోయింది. గవర్నర్ ఇలా మాట్లాడటం ప్రభుత్వ ఇమేజ్‌కు భంగం కలుగుతుందని సీనియర్ కార్యదర్శులు నెత్తీనోరూ మొత్తుకుంటున్నారు. నరసింహన్ రాష్ట్రానికి వచ్చిన దగ్గర నుంచి స్వతంత్రంగా వ్యవహరించడం ప్రభుత్వ పెద్దలకు మింగుడు పడటం లేదు. యూనివర్సిటీల పాలకమండళ్లను ఒక్క పెన్నుపోటుతో రద్దు చేసి కొత్తవారితో వాటిని పునర్వ్యవస్థీకరించడం లాంటి నిర్ణయాలు 'రాజకీయుల'కు నచ్చడం లేదు. అయితే గవర్నర్ మాత్రం ఎవరేమనుకుంటే నాకేమిటి? అంటూ తన పని తాను చేసుకుపోతున్నారు.

## ధర్మపాలకుడు శనైశ్చరుడు!



నవగ్రహ ప్రభావం ప్రతి ఒక్కరిపై ఎంతోకొంత వుంటుంది. ఈ గ్రహాలలో అతిశక్తివంతమైనది, ప్రభావశాలి శని గ్రహం. శని దేవుడు నీలాకాశంలో నీలాంజన సమాభాసుడై నీలి హర్మ్యంలో నీలమణులతో వున్న దివ్యాలయంలో కొలువుదీరి వుంటాడు. ఎన్నో ఉపగ్రహాలతో కాంతివలయంలో తేజోమయంగా కన్పిస్తాడు. చాలామంది శని పేరు వింటే అరిష్టం అని, ఆయన విగ్రహాన్ని తాకితే దోషం అంటుకుంటుందని భయపడుతుంటారు. అయితే అవన్నీ అపప్రథలని పురాణాలు చెప్తున్నాయి. వాస్తవానికి శని న్యాయాధికారి వంటివాడు. అకారణంగా ఎవరిని బాధించడు. మానవుల పాపకర్మలను అనుసరించి గోచారరీత్యా ఆయా వ్యక్తులను ప్రేరేపించి వారితో ఆయా కర్మల ఫలితాలను అనుభవించేలా చేస్తాడు. దానధర్మాలతో సత్యం, అహింసలను ఆచరిస్తూ, పవిత్రంగా జీవించే వారికి ఎటువంటి ఆపద వాటిల్లకుండా కాపాడుతూ వారికి సకల శుభాలు కలుగచేస్తాడు. వైరాగ్యం కల్గించి భగవంతుని ప్రార్థించమని గురువై బోధిస్తాడు. భయంతో కాకుండా భక్తితో ఆయనను వేడుకొంటే సర్వశుభాలు కలిగి ఐశ్వర్యం సిద్ధిస్తుంది. మన రాశికి ముందు 12వ రాశిపైన, 2వస్థానంలో శని సంచరించడాన్ని ఏలినాటి శని అంటారు. ఆ సమయంలో శని దశ జరుగుతుండగా జాతకంలో శని పీడన స్థానంలో ఉంటే బాధిస్తాడు. మకర, కుంభరాశులు శనీశ్వరునికి సమీప రాశులు కాబట్టి ఆ రాశి వారిని ఎక్కువ బాధిస్తాడు. శని నక్షత్రాలైన పుష్యమి, అనూరాధ, ఉత్తరాభాద్రలో జన్మించిన వారికి శని పీడన తక్కువగా వుంటుంది. శని వున్న స్థానం కంటే చూపు తీవ్రమైంది. ధర్మపాలకుడైన శనీశ్వరుడికి ఇనుము, నల్లనువ్వులు, మినుములు, నీలివర్ణంలో వుండే పుష్పాలు, పత్తి, నువ్వులనూనె, నల్లని వస్త్రాలు, వస్తువులు ప్రీతికరమైనవి. శనివారం నాడు ప్రత్యేకించి శని త్రయోదశినాడు నిర్మల మనస్సుతో, భక్తిభావంతో ఎవరైతే తైలాభిషేకం చేస్తారో వారి జోలికి రానని వరమిచ్చినట్లు పురాణకథనం. భైరవస్తోత్రం చేసినా, ఆంజనేయుని అర్చించినా, వెంకటేశ్వరుని ఆరాధించినా శని దేవున్ని ప్రసన్నం చేసుకోవచ్చు.

## జగన్‌పై కెసిఆర్ కన్నెర్ర



వై.ఎస్ కుమారుడు జగన్మోహన్‌రెడ్డిపై కెసిఆర్ మండిపడుతున్నాడు. ఓదార్పు పేరుతో జగన్ 'షో' చేస్తున్నాడంటూ పత్రికలకెక్కాడు. సమైక్యవాదిగా వున్న జగన్ తెలంగాణకు ఎలా వస్తాడని అంటున్నాడు. జగన్ తెలంగాణ యాత్రను అనుమతించి ముఖ్యమంత్రి, డిజిపి ఘోరమైన తప్పు చేశారని దుమ్మెత్తిపోస్తున్నాడు. జగన్ తెలంగాణకు వస్తే తాను కూడా ఆంధ్రాప్రాంతానికి వెళ్తానని హెచ్చరికలు జారీ చేశాడు. దీంతో తెలంగాణలో జగన్ ఓదార్పు యాత్ర వివాదాస్పదంగా మారింది. జగన్ తెలంగాణలో అడుగుపెడితే తిరిగి వెళ్లడం కష్టమని కెసిఆర్ ఇప్పటికే సంకేతాలు పంపాడు. దీంతో జగన్ కూడా పునరాలోచనలో పడ్డాడట. అయితే తెలంగాణలోని వై.ఎస్ వీరవిధేయులు మాత్రం తాడోపేడో తేల్చుకుంటామంటూ తొడగొడ్తున్నారు.

## అమ్మకానికి ఇంజనీర్లు




వ్యవసాయ మార్కెటింగ్‌శాఖలో ఇంజనీర్ల పోస్టుల్ని అమ్మకానికి పెట్టారట. మొత్తం 72 ఇంజనీర్ల పోస్టుల్ని భర్తీ చేయడానికి ఆ శాఖ సన్నాహాలు చేస్తోంది. మామూలుగా అయితే ఆంధ్రప్రదేశ్ పబ్లిక్ సర్వీస్ కమీషన్ ద్వారా ఇంజనీర్ల పోస్టుల్ని భర్తీ చేయాలి. కాని మార్కెటింగ్‌శాఖ మాత్రం సొంతంగానే భర్తీ ప్రక్రియను చేపట్టింది. హైదరాబాదులోని జవహర్‌లాల్ టెక్నాలజీ యూనివర్సిటీ వారు అభ్యర్థులకు పరీక్షలు నిర్వహిస్తారట. మార్కెటింగ్ శాఖ అధికారులతో కూడిన కమిటీ ఇంటర్వ్యూల్ని పెట్టి ఇంజనీర్లను ఎంపికచేస్తారట. ఇప్పటికే ఈ పోస్టులకోసం బేరసారాలు జోరుగా సాగుతున్నట్లు వినికిడి. ఒక్కో ఇంజనీరు పోస్టుకు 15 నుంచి 20 లక్షల రూపాయలదాకా పలుకుతోందట. ఇదిలా వుంటే ఈ పోస్టుల భర్తీ రాష్ట్రపతి ఉత్తర్వులకు (610 జీవో) వ్యతిరేకంగా వందని తెలంగాణ ఉద్యోగుల సంఘాలు ముఖ్యమంత్రికి ఫిర్యాదు చేశాయి. మార్కెటింగ్ శాఖ మాత్రం ఇవేం పట్టించుకోకుండా ఇంజనీర్ల పోస్టుల భర్తీకి అత్యుత్సాహం చూపుతోంది.




రాజీవ్‌భవన్ నగర ప్రజల దాహార్తి తీర్చను ఏర్పాటు చేసిన వాటర్ ట్యాంకర్‌ను ప్రారంభిస్తున్న జడ్పీ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి. ప్రక్కన రాజీవ్‌భవన్ నిర్వాహకులు.

## మంత్రి సేవలో తరించారు!



ఒక్కసారి మంత్రిని చేయి గణనాధ అని కీర్తించడం వూరకే కాదు. ఆ పదవిని అనుభవించిన వారికే ఈ విషయం స్వానుభవంలోకి వస్తుంది. పురపాలక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి కుమారుని నిశ్చితార్ధం గతవారం నెల్లూరు మినీ బైపాసురోడ్డులోని ఓ కళ్యాణమండపంలో జరిగింది. మంత్రి నగరంలో ఏదైనా కార్యక్రమంలో పాల్గొంటే ముందు వెనుక శబ్దం చేసుకొంటూ కాన్వాయ్ పోవడం సహజమే. కాని నిశ్చితార్ధం సందర్భంగా మంత్రి గారి కుటుంబసభ్యులు, బంధువులు వెళ్లే వాహనాలకు సైతం పోలీసులు కాన్వాయ్‌గా సైరన్ మోగించుకొంటూ ఒకటికి మూడుసార్లు వెళ్లడంతో పోలీస్‌శాఖ విమర్శల పాలయ్యింది. నగర ప్రజలు మాత్రం మంత్రి గారి ఇంట్లో నిశ్చితార్థం కదా అని చర్చించుకోవడం జరిగింది.

## ఎక్కడ చూసినా అదే కారు



జిల్లా కేంద్రంలో పనిచేసే అధికారుల్లో చాలామందికి ప్రభుత్వం విధినిర్వహణలో భాగంగా తిరగను కార్లు సమకూర్చి పెట్టింది. చాలా మంది జిల్లా అధికారులు తమ కార్లను ఆఫీసులకు, క్యాంపులకు వెళ్లిరాను వుపయోగించుకొంటుంటారు. ఇటీవలే రాష్ట్ర ప్రభుత్వం అన్ని జిల్లాలకు అదనపు జాయింట్ కలెక్టర్లను ఏర్పాటు చేస్తూ నెల్లూరుకు టి.సీతారామయ్య అనే అధికారిని నియమించారు. ఆయనకు ఓ టయోటా కారు సమకూర్చారు. ఈ టయోటా కారు ప్రతి దినం నగరంలోని రోడ్లపై గంటగంటకు తిరుగుతూ అందరినీ ఆశ్చర్యపరుస్తుంటుంది. చిత్రమేమిటంటే ఎప్పుడోగాని ఈ కారులో సీతారామయ్య గారు కనపడరు. మరి ఈ కారు నగర సంచారమేమిటో అర్ధంకాక జనాలు ఆశ్చర్యపోతున్నారు. టయోటా నగర సంచారానికి కారణాలు సీతారామయ్య గారే చెప్పాలి మరి!

## దొంగపోలీస్ ఎవరు?




ఇంటి దొంగను ఈశ్వరుడైనా పట్టలేడన్నట్లుగా వుంది తుపాకీ మాయం చేసిన పోలీసు దొంగను కనిపెట్టలేకపోవడం. నెల్లూరు ట్రెజరీలో సెంట్రీ డ్యూటీ చేసే సమయంలో ఐదు బుల్లెట్లతో నింపిన తుపాకీ కన్పించకుండా పోయింది. దీనిపై ఉన్నతాధికారులు ఆ సమయంలో విధులు నిర్వర్తిస్తుండిన కానిస్టేబుళ్లపై సస్పెన్షన్ వేటు వేశారు. అయితే ఇప్పటివరకు తుపాకీ ఆచూకి లభించలేదు. ఒక వైపు మావోయిస్టుల కదలికలపై దృష్టిసారించామని చెప్తున్న పోలీసులు, మరోవైపు వివిఐపిల పర్యటనల నేపథ్యంలో నిండుగా బుల్లెట్లు లోడ్‌చేసి వున్న తుపాకీ అసాంఘిక శక్తుల చేతుల్లోకి వెళ్తే ఎంత ప్రమాదకరమో ఆలోచించరేం? దొంగల ముఠాలను, పైరసీ సిడి తయారీదారులను క్షణాల్లో పట్టుకుంటున్న పోలీసులు తమలోనే వున్న దొంగను మాత్రం పట్టుకోలేకపోవడం విమర్శలకు తావిస్తోంది.

## హాట్‌న్యూస్ కేరాఫ్ వివేకా!




నెల్లూరు రూరల్ శాసనసభ్యుడు వివేకానంద రెడ్డిది పెద్దనోరని రాష్ట్రంలోని అన్ని పార్టీల వారికి తెలుసు. ఈ విషయాన్ని రాష్ట్ర వ్యవసాయశాఖ మంత్రి రఘువీరారెడ్డి కూడా ధృవీకరించారు. రామనారాయణరెడ్డి కుమారుని నిశ్చితార్ధాన్ని పురస్కరించుకొని శుభకర్‌రెడ్డిని ఆశీర్వదించను రఘువీరా నెల్లూరు వచ్చారు. మీడియా ఆయనను కలసి ఏవైనా విశేషాలుంటే చెప్పమని అడిగారు. దీనికి సమాధానంగా ఆయన నాదగ్గర న్యూస్‌లు లేవు. హాట్ న్యూస్‌లు కావాలంటే వివేకానందరెడ్డి దగ్గరకు వెళ్లమని సలహా యిచ్చారు. మీ అన్న దగ్గరే కదా హాట్ న్యూస్‌లు దొరికేదని రామనారాయణతో రఘువీరా చెప్పగా ఆయన ఔనంటూ తలూపడం కొసమెరుపు.

## న్యాయవాదుల బాహాబాహి!



సమాజంలోని అన్ని పరిపాలనా అంగాలు భ్రష్టుపట్టినా న్యాయవ్యవస్థపై మాత్రం జనానికి ఇంకా గౌరవం సన్నగిల్లలేదు. ఘనచరిత్ర గల నెల్లూరు బార్ అసోసియేషన్‌లో ఇద్దరు యువ న్యాయవాదులు కొట్లాటకు దిగి అందరినీ ఆశ్చర్యపరిచారు. జిల్లా కోర్టు ప్రాంగణంలోని ఫ్యామిలీ కోర్టులో ఓ భరణం కేసు విచారణకు వచ్చింది. ఈ సందర్భంగా కక్షిదారుల న్యాయవాదులు విచారణ అనంతరం న్యాయస్థానం ప్రాంగణంలో రాయలేని భాషలో తిట్టుకొన్నారు. దీనివల్ల కోర్టు పనులు స్తంభించాయి. విషయం పోలీసుల వరకు వెళ్లింది. నాల్గవ పట్టణ ఎస్ఐ వేమారెడ్డి ఇప్పటివరకు ఖాకీ దుస్తులతో పోలీసులు విచారణకు వెళ్లని బార్ అసోసియేషన్ హాలుకు వెళ్లారు. మొత్తం మీద న్యాయవాదుల బాహాబాహి నెల్లూరు బార్ అసోసియేషన్ చరిత్రలో మాయని మచ్చగా మిగిలింది.

## ప్రసాదం బ్రహ్మాండం



డైలాగ్‌కింగ్ మోహన్‌బాబు రూటేవేరు. ఆయన ఏ విషయాన్నైనా కుండబద్దలు కొట్టినట్లు మాట్లాడుతాడు. ఇటీవల ఆయన కుటుంబసభ్యులతోపాటు దర్శకుడు కె.రాఘవేంద్రరావును తోడు తీసుకొని నెల్లూరులో కొన్ని కార్యక్రమాల్లో పాల్గొన్నారు. పనిలోపనిగా పెంచలకోనలోని నరసింహస్వామిని సందర్శించారు. ఈ సందర్భంగా దేవస్థానం ఛైర్మన్ అమరా శ్రీరాములుశెట్టి మంచి అతిథి మర్యాదలు చేసి స్వామి ఫోటోలు, మంచి ప్రసాదం ఆయనకు పెట్టారు. ప్రసాదాన్ని ఆసాంతం తిన్న మోహన్‌బాబు రుచికి దాసోహమయ్యారు. రాష్ట్రంలోని ఏ గుడిలోనూ ప్రసాదం బాగుండడం లేదని బాంబు పేల్చారు. పెంచలకోనలో మాత్రం ప్రసాదం బ్రహ్మాండమని ఇంకాస్త అడిగి తీసుకొని తిన్నారు.

# వారఫలాలు

తేది 17-04-2010 నుండి 23-04-2010 వరకు మేషంలో రవి, బుధులు; మేష, వృషభాల్లో శుక్రుడు; కుంభంలో గురువు; కర్కాటకంలో కుజుడు; కన్యలో శని; ధనుస్సులో రాహువు; మిథునంలో కేతువు; వృషభ, మిథున, కర్కాటకాల్లో చంద్రుడు సంచరిస్తారు.

## పంచాంగం

**శుభ ముహూర్తాలు**

19 తేది ఉ.8.00గం.ల నుండి 9.00ల వరకు వృషభ లగ్నాన.

21తేది మ.2.00గం.ల నుండి 3.00ల వరకు సింహలగ్నాన సుముహూర్తాలున్నాయి.

**ఏప్రెల్ తిథులు**

**అధిక వైశాఖ శుద్ధ**

| | | | |
|---|---|---|---|
| 17 శని | తదియ | సా.5.35 | గం.ల.వ |
| 18 ఆది | చవితి | సా.4.48 | గం.ల.వ |
| 19 సోమ | పంచమి | సా.3.42 | గం.ల.వ |
| 20 మంగళ | షష్ఠి | మ.2.18 | గం.ల.వ |
| 21 బుధ | సప్తమి | మ.12.37 | గం.ల.వ |
| 22 గురు | అష్టమి | ఉ.10.40 | గం.ల.వ |
| 23 శుక్ర | నవమి | ఉ.8.26 | గం.ల.వ |

పి.ఎం.గోపాలాచారి
16/1020, పొగతోట, నెల్లూరు - 1.
E-mail:maripmgg@yahoo.com



**మేషం** అశ్వని, భరణి, కృత్తిక 1 పా

అధిక ఖర్చులు మనసును కుంగతీస్తాయి. దూరప్రయాణావకాశాలు. దైవ కార్యాలలో ఎక్కువగా పాలు పంచుకోవాలి. వ్యాపారులకు లాభాలలో కొంత కోత ఏర్పడవచ్చు. నిదానంగా ఖాతాదారుల మనసెరిగి నడచుకోవడం మంచిది. భాగస్వాములతో గొడవలు రాకుండా చూసుకోవాలి. రాజకీయులు లేనిపోని గొడవల్లో చిక్కుకొంటారు. ఉద్యోగులకు శ్రమ అధికం.



**వృషభం** కృత్తిక 2,3,4 పా. రోహిణి, మృగశిర 1,2 పా

చాలా ప్రోత్సాహకరమైన కాలం. నోటికి సంబంధించిన ఇబ్బందులుండవచ్చు. ప్రయాణాలలో జాగ్రత్త. అనుకొన్న పనులు అనుకొన్నరీతిలో సాగుతాయి. సంతానమూలంగా సుఖశాంతులు లభిస్తాయి. వారి విద్యారంగం ప్రోత్సాహకరంగా ఉంటుంది. ధన విషయంలో లోటుండదు. భవిష్యత్తుకు మంచి పథకాలు వేస్తారు. పురోభివృద్ధి అన్ని రంగాలలో ఉంటుంది.



**మిథునం** మృగశిర 3,4 పా. ఆర్ద్ర,పునర్వసు,1,2,3 పా

పొరసంబంధాలు చక్కగా వుండవు. జీవితభాగస్వామి బంధువులతో గొడవలుండవచ్చు. నోరు పారవేసుకోకుండుట మంచిది. ప్రతి పని నిలిచి నిదానంగా చేయడం మంచిది. వృత్తిలో మార్పు చేర్పులుండవచ్చు. వ్యాపారులకు కొంతవరకు మేలు. భాగస్వాములతో జాగ్రత్త, దైనందిన కార్యక్రమాలలో ఆటంకాలుండవచ్చు. విద్యార్థులకు ఒకమోస్తరుగా చదువు సాగుతుంది.



**కర్కాటకం** పునర్వసు 4 పా. పుష్యమి, ఆశ్లేష

అనుకొన్నపనులన్నీ అనుకొన్నరీతిలో ప్రణాళికాబద్ధంగా జరుపుకొంటూపోతారు. ఉద్యోగవృద్ధి, వేతనవృద్ధి ఉంటుంది. ఇంత వరకు ఉంటూవచ్చిన ఇబ్బందులు తొలగుతాయి. చిరకాలంగా ఎదురు చూస్తూవచ్చిన శుభఫలితాలు అనుభూతిలోనికి వస్తాయి. శత్రువులు లొంగి నడచుకొంటారు. మాతృసంబంధీకులకు సాయ మందిస్తారు. కుజుని కొలవాలి. ఆరోగ్యవిషయంలో జాగ్రత్త.



**సింహం** మఖ, పుబ్బ ఉత్తర 1 పా

వృథా ఖర్చులు తయారుగా ఉంటాయి. ప్రతి అడుగు ఆచి తూచి వేయడం మంచిది. అనవసరపు విషయాలలో జోక్యం చేసుకోకుండుట మంచిది. ఆర్థికవిషయాలు కొంత తృప్తికరంగా ఉంటాయి. వ్యాపారులు భాగస్వాములతో సఖ్యంగా ఉండడానికి ప్రయత్నించండి. కఠినంగా మాట్లాడవద్దు. రాజకీయులు తోటివారి విషయంలో జాగ్రత్తగా ఉండాలి. పైవారిని విమర్శించకుండాలి.



**కన్య** ఉత్తర 2,3,4 పా. హస్త, చిత్తా 1, 2 పా

నరాలకు సంబంధించిన బాధలధికం. గాయాలు తగుల వచ్చు. ప్రయాణాలలో జాగ్రత్త అవసరం. ముందుచూపుతో అడుగేయాలి. సంతానమూలంగా ఇబ్బందులుండవచ్చు. కోరినా సలహాలివ్వవద్దు. గుట్టుగా కాలం గడపడం మంచిది. ఆర్థిక విషయాలు అంతంతమాత్రమే. వ్యాపారులు ఖాతాదారులతో జాగ్రత్తగా మెలగాలి. రాజకీయులకు తీరని వేదన చోటుచేసుకొంటుంది.



**తుల** చిత్తా 3, 4 పా. స్వాతి, విశాఖ 1, 2, 3 పా

కష్టసుఖాలు సమానంగా చోటు చేసుకొంటాయి. ఊహించనిరీతిలో ధనవ్యయమవుతుంది. ఆరోగ్య విషయంలో జాగ్రత్త. ఎంత పొదుపు చేయాలనుకున్నా వీలుకాదు. సోదరులమూలంగా కూడ ఖర్చు అవవచ్చు. బంధుమిత్రుల సహాయసహకారాలు అందుతాయి. గృహనిర్మాణము లేదా వసతి గృహాన్ని అమ్మడం అనే పనులలో నిమగ్నమవుతారు. శనిని ఆంజనేయుని తప్పక కొలవాలి.



**వృశ్చికం** విశాఖ 4 పా. అనూరాధ, జ్యేష్ఠ

ప్రయాణాలలో సత్ఫలితాలు ఎదురుచూడవచ్చు. చిన్న చిన్న సమస్యలు ఎదురవవచ్చు. ఉద్యోగ ప్రయత్నాలు ఫలిస్తాయి. నూతన వస్త్రాభరణాలు కొంటారు. నోటికి సంబంధించిన అనారోగ్య బాధ లుంటాయి. విదేశీప్రయాణావకాశాలు కానవస్తున్నాయి. గృహ నిర్మాణ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. మిత్రులు సాయ మందిస్తారు. కుటుంబంలో సమస్యలు తీరుతాయి.



**ధనస్సు** మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా

ఆరోగ్యవిషయంలో శ్రద్ధ అవసరం. మిత్రుల మూలంగా మేలు. ధనవిషయాలలో లోటు లేదు. వివిధమార్గాలలో ధనప్రాప్తి అవకాశాలు. ఆగిన పనులు నిదానంగా సాగుతాయి. ఇతరులతో అభిప్రాయభేదాలు రావచ్చు. శుభకార్యాచరణకు శ్రీకారం చుడతారు. మాట నిలబెట్టుకోవడానికి శ్రమపడతారు. రాజకీయులకు ఉత్తమ కాలం. వ్యాపారులకు మంచి లాభావకాశాలు. విద్యార్థులకు శ్రమ.



**మకరం** ఉత్తరాషాఢ 2, 3,4 పా. శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా

తలకు గాయాలు తగిలే అవకాశాలెక్కువ. జాగ్రత్త. ధనవిషయంలో కూడ కటకట ఉండవచ్చు. సోదరులతో అభిప్రాయభేదావకాశాలు. పనులు నిదానంగా సాగవచ్చు. ఒకటికి రెండుసార్లు ఆలోచించి చేయడం మంచిది. వ్యాపారులకు గడచిన వారంలో ఏర్పడ్డ నష్టాలను ఈ వారంలో పూడ్చుకో వీలవుతుంది. అప్పులు తీరుస్తారు. విద్యార్థులకు ఒకవిధంగా చదువు సాగుతుంది.



**కుంభం** ధనిష్ఠ 3,4 పా. శతభిషం, పూర్వ భాద్ర 1,2,3 పా

ఆరోగ్యవిషయంలో పెద్దగా చెప్పుకోతగ్గవేమీ లేవు. అయినా పాదాలకు సంబంధించిన బాధలుంటాయి. సాధారణంగా గడచిపోతుంది. ఆర్థికవిషయాలు చక్కగా ఉంటాయి. నూతన వస్త్రాభరణాలు కొంటారు. తండ్రి తండ్రివంటివారికి ఇబ్బందులుండవచ్చు. శ్వేతప్రదరం బాధించవచ్చు. గృహాలంకరణవిషయాలలో ఆసక్తి చూపుతారు. ఖర్చుకు వెరవరు. ప్రతి పనిలో దూకుడు అధికం.



**మీనం** పూర్వాభాద్ర 4 పా. ఉత్తరాభాద్ర, రేవతి

గడచినకాలం కన్నా మేలైన కాలం. విరోధులు తగ్గుముఖం పడతారు. పద్ధతి ప్రకారం పనులు నిర్వహిస్తారు. ప్రయాణాలు సుముఖంగా సాగుతాయి. ఆర్థిక లావాదేవీలు మీకు అనుకూలంగా ఉంటాయి. ఇన్నినాళ్ళు ఆటంకాలతో అడ్డుపడ్డ పనులు ఊపందుకొంటాయి. నూతన ఉద్యోగావకాశాలు లభించవచ్చు. భూభవనాల ద్వారా ఆదాయమార్గాలు సులభతరమవుతాయి.

# కార్యసిద్ధి తర్వాత మ్రొక్కులు చెల్లించాలి!

*పి.శివరామిరెడ్డి ఒంగోలు*

★ *ఆస్తి అమ్ముడుపోతుందని కలలో కూడా అనుకోలేదు. శివానుగ్రహం వల్ల విక్రయమయింది. ఆర్థిక సమస్యలు తలెత్తుతున్నాయి.*

వశిష్ఠ, విశ్వామిత్ర, మయవాస్తులు ఈ అంశాన్ని తీవ్రంగా పరిగణిస్తున్నాయి. రోగం, మృత్యువు ఆకస్మికమని చెబుతున్నాయి. మ్రొక్కులు చెల్లించుకొని దారిద్ర్యస్థితికి దూరంకండి.

*సోమ నరేంద్ర చెన్నై*

★ *వాస్తు దోషాలన్నీ సరిచేసుకున్నాక, కంపెనీ లావాదేవీలన్నీ పరిష్కరింపబడ్డాయి. ఆశ్చర్యం ఏమిటంటే వసూలు కావనుకున్న అప్పులు, తిరిగి చెల్లించబడ్డాయి.*

యజమానికి ప్రాప్తమయ్యే దిక్‌దోషాలు, ఉత్తర కుబేరస్థానచ్యుతి ఓడల్ని బండ్లను చేస్తాయి. మళ్లీ సమస్యలు మటుమాయమైపోయాయంటే మీరు వాస్తు దోషాల్ని సరిచేసుకున్నారు కాబట్టి!

*ఎ.కుసుమకుమారి అనంతపురం*

★ *పచ్చకు ప్రత్యామ్నాయం ఎమ్రాల్డ్ ధరించినా ఫలితం కనిపించలేదు.*

బుధస్థాన స్థితికి పచ్చ, ఎమ్రాల్డ్ ఏవైనా మంచివే. అయితే రత్నాలను కాశీ 'శాంతి' ఆశ్రయం నుంచి తెప్పిస్తే శ్రేష్ఠత వుంటుంది. షాపుల్లో 'డూప్లికేట్స్' ఎక్కువ.

*సోమ నరేంద్ర చెన్నై*

★ *వాస్తు దోషాలన్నీ సరిచేసుకున్నాక, కంపెనీ లావాదేవీలన్నీ పరిష్కరింపబడ్డాయి. ఆశ్చర్యం ఏమిటంటే వసూలు కావనుకున్న అప్పులు, తిరిగి చెల్లించబడ్డాయి.*

యజమానికి ప్రాప్తమయ్యే దిక్‌దోషాలు, ఉత్తర కుబేరస్థానచ్యుతి ఓడల్ని బండ్లను చేస్తాయి. మళ్లీ సమస్యలు మటుమాయమైపోయాయంటే మీరు వాస్తు దోషాల్ని సరిచేసుకున్నారు కాబట్టి!

*పి.చంద్రశేఖరశర్మ బెంగుళూరు*

★ *కృష్ణరాయ మరణం గురించి 'వాస్తు దోషయుతం నిర్మాణం' అని మీరన్నారట. లయన్స్‌క్లబ్ వారు చెప్పారు.*

క్రీ.శ.1513లో రాయలు ఉదయగిరిని జయించాక అక్కడ నుంచి 'బాలకృష్ణ' విగ్రహాన్ని తెచ్చి హంపీలో బాలకృష్ణాలయం, కటక్ విజయం తర్వాత 1519లో భువన విజయం, క్రీ.శ.1520 రాయచూర్ యుద్ధం తర్వాత 'రాజసౌధ నిర్మాణం' చేశాడు. వాటిలోని నైరుతి, వాయువ్య, ఈశాన్య దోషాలు అనారోగ్యాన్ని, ఆకస్మిక మృత్యువునూ కలిగించాయి. ఇది వాస్తవం కూడా.

## వాస్తు సందేహాలు సమాధానాలు

ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*పురిట్ల వసుంధర గూడూరు*

★ *ఒక సంవత్సరం నుంచి ప్రయత్నిస్తున్నా, వాస్తుదోషాలు సరిచేసుకోలేక పోతున్నాం.*

'బుద్ధి కర్మానుసారిణీ' అన్నారు. ప్రాప్తం రానపుడు ఎవరైనా ఇంతే. అయితే నైరుతి దోషాల విషయంలో 'అలస్యాత్ అమృతం' విషం అన్నారు. ఇలాంటప్పుడే తగ్గిన వ్యాధి అయినా తిరగబెడుతుంది.

*షేక్ కుతుబుద్దీన్ ఉదయగిరి*

★ *మా ఉదయగిరిలో 'రఘునాథాలయం చూశారా? ఆగమశాస్త్రం ప్రకారం బాగుందా?*

శాస్త్రం పట్ల మీకున్న శ్రద్ధాసక్తులు అభినందించదగ్గవి. ఆలయాన్ని చూశాను. ఆలయానికి వీధిదృష్టి వేధ వుంది. ఈశాన్యం భ్రంశత, దక్షిణ ముఖాభిముఖ క్షేత్ర వేధ ఆలయాన్ని నిర్వీర్యం చేశాయి. అయితే ఆగమసిద్ధ ప్రణాళిక పథక రచన అద్భుతంగా వుంది.

*ఎమ్.భరత్‌కుమార్ కావలి*

★ *మెట్లు ముందు వెనుకా వున్నాయి. మధ్యలో కూడా వున్నాయి.*

హాల్లో నిర్మించినవి దక్షిణ, పశ్చిమాల్లో ఉండి అవి ఏ మూలలపైకి వెళ్లకుండా చూసుకోవలసింది. ముందు నైరుతి రావలసిన మెట్లు ఆగ్నేయంలో పెట్టడం శుద్ధతప్పు. పరిస్థితిని చక్కదిద్దడం చాలా చాలా కష్టం!

# దుస్థితిలో చెన్నూరు పంచాయితీ!

గూడూరు రూరల్ మండలంలో మేజర్ పంచాయితీగా పేరొందిన చెన్నూరు గ్రామ పంచాయితీలో పరిస్థితులు దుర్భరంగా వున్నాయి. జిల్లాలోని వివిధ పంచాయితీలలో ఎంతో కొంతమేర అభివృద్ధి పనులు చేపట్టివున్నా ఈ పంచాయితీలో మాత్రం అభివృద్ధి పనులు జరగడం లేదు. గ్రామ పంచాయితీ పరిధిలోని ప్రజలు పలు సమస్యలతో సతమతమవుతున్నా పట్టించుకునే దిక్కు లేకుండా పోయింది. ఏదైనా సమస్య పరిష్కారం కోసం పంచాయితీ కార్యాలయానికి వచ్చిన ప్రజలకు సమాధానం చెప్పేందుకు గ్రామ సర్పంచ్‌గాని, కార్యదర్శిగాని అందుబాటులో వుండడం లేదు.

తెలుగుదేశం పార్టీకి చెందిన శీనయ్య సర్పంచ్‌గా ఎన్నికయ్యాడు. ఎన్నికైన నాటి నుంచి కూడా పంచాయితీ పరిధిలో చేపట్టాల్సిన పనులను గుర్తించకపోవడంతో ప్రజలు ఎదుర్కొంటున్న పలు సమస్యలను అసలు పట్టించుకోవడం లేదన్న ఆరోపణలు వున్నాయి. ఎస్సీ, ఎస్టీ, బిసి కాలనీలలో త్రాగునీటి కోసం ప్రజలు అనేక అవస్థలు పడుతున్నారు. గ్రామానికి శివారున వున్న మిక్స్‌డ్ కాలనీలో కూడా పరిస్థితులు ఘోరంగా వున్నాయి. ఈ కాలనీలో అంతర్గత రోడ్లపై గుంటలుపడి ద్విచక్రవాహనాలు సైతం వెళ్లలేని దుస్థితి నెలకొని వుంది.



**త్రాగునీటి సమస్య వుంది!**

కాలనీలో ప్రధానంగా త్రాగునీటి సమస్యతో ప్రజలు ఇబ్బందులు పడుతున్నారు. పంచాయితీ ఏర్పాటుచేసిన కొళాయిల ద్వారా త్రాగునీరు సక్రమంగా సరఫరా జరగడం లేదు. ఎన్నిసార్లు సర్పంచ్, మండల అధికార్లకు విన్నవించుకున్నా పట్టించుకోలేదు.

– ఈశ్వరయ్య



**వీధులు అధ్వాన్నం!**

పంచాయితీ పరిధిలోని కాలనీలలో వీధులు చాలా అధ్వాన్నంగా తయారైవున్నాయి. కొన్ని పంచాయితీలలో సిమెంటురోడ్లు, గ్రావెల్‌తో రోడ్లు నిర్మించినప్పటికీ మా కాలనీలో కనీసం మట్టి కూడా తోలలేదు. ఇప్పటికైనా అధికారులు స్పందించి వీధులకు గ్రావెల్ వేయాల్సిన అవసరం వుంది.

– చిరంజీవి

డ్రైనేజి కాల్వల నిర్మాణం చేపట్టక పోవడం వల్ల మురికినీరు వీధులలో పారుతుంది. ఈ మురికి నీటిలో కుక్కలు, పందులు స్వైర విహారం చేస్తుంటాయి. వీటి కారణంగా ఎక్కడ అంటువ్యాధులు వ్యాపిస్తాయోనని స్థానికులు భయాందోళన చెందుతున్నారు. గ్రామ పంచాయితీ కార్యాలయం వద్ద కేవలం ఒక గ్రామ సేవకుడు మాత్రమే వుంటున్నాడు. ఈ పంచాయితీకి ప్రభుత్వం నుంచి ఎన్ని నిధులు విడుదల అవుతున్నాయి. ఎంత ఖర్చు చేస్తున్నారు. ఇంటిపన్నులు ఎంత మొత్తంలో వసూలు చేస్తున్నారన్న వివరాలు అందించేందుకు అందుబాటులో ఎవరు వుండడం లేదు. వృద్ధాప్య పింఛన్లు, ఇందిరమ్మ ఇళ్లు నిర్మించుకున్న ప్రజలు కార్యాలయం చుట్టూ తిరుగుతున్నారు.

గ్రామంలో చేపట్టిన ఇందిరమ్మ గృహ నిర్మాణాలు కూడా అసంపూర్తిగానే కనిపిస్తూ అధికారుల నిర్లక్ష్యాన్ని తెలియజేస్తున్నాయి. ఎస్సీ, ఎస్టీ కాలనీల ప్రజలను సమస్యల గురించి కదిలిస్తే పంచాయితీ సర్పంచ్, అధికారులను శాపనార్థాలు పెడుతున్నారు. ఈ క్రమంలో పంచాయితీ పరిధిలోని సమస్యలపై స్థానికులు వెల్లడించిన అభిప్రాయాలను ప్రక్కన ఇస్తున్నాం.



నడిరోడ్డుపై పగిలిన పైపు లైను.



మంచినీటి కొళాయి వద్ద పేరుకున్న మురుగు.

అవినీతి కథ

# శిక్షణ పేరుతో నిధుల భక్షణ!

అధికారుల లంచగొండితనం, ప్రైవేటు సంస్థల నిర్లక్ష్యం కారణంగా ప్రభుత్వ నిధులు దుర్వినియోగం అవుతున్నాయి. వేలాది రూపాయలు వృత్తిపరమైన శిక్షణకు ప్రభుత్వం కేటాయించి విడుదల చేయడం జరుగుతుంది. ప్రభుత్వం విడుదల చేసిన నిధులతో శిక్షణ పేరుతో ప్రైవేటు సంస్థలకు దోచిపెడుతున్నారన్న ఆరోపణలు వున్నాయి. ఈ తంతు పలు సంక్షేమ శాఖల్లో జరుగుతున్నా స్త్రీ, శిశు సంక్షేమశాఖ మరో అడుగు ముందుకేసింది. ప్రభుత్వ నిధుల వినియోగం సక్రమంగా జరగాలని ఎన్ని నిబంధనలు విధిస్తున్నా వీటిలో ఏదో ఒక లొసుగును ఆసరా చేసుకొని నిధుల దుర్వినియోగానికి పాల్పడుతుంటారు.

దీనికి ఉదాహరణగా స్త్రీ, శిశు సంక్షేమ శాఖను పేర్కొనవచ్చు. ఈ శాఖ ఆధ్వర్యంలో అంగన్‌వాడి వర్కర్లకు పలు దఫాలుగా వృత్తిపరమైన శిక్షణ కార్యక్రమాలు జరుగుతుంటాయి. అంగన్‌వాడి కార్యకర్తగా ఎంపికైన తర్వాత గ్రామీణ, పట్టణ ప్రాంతాలలో పలు అంశాలకు సంబంధించి వీరు సేవలు అందించాల్సి వుంటుంది. పౌష్టికాహారం పంపిణీ, బాలింతలు, గర్భిణులకు సకాలంలో టీకాలు వేయించడం, ఆటపాటల ద్వారా చిన్నారులకు విద్యను బోధించడం వంటి కార్యక్రమాలు నిర్వహిస్తుంటారు. కార్యకర్తగా ఎంపికైన తర్వాత ముందుగా సేవలకు అవసరమైన శిక్షణ ఇప్పించాల్సి వుంటుంది. అయితే ఈ శాఖ అధికారులు ముందుగా శిక్షణ ఇప్పించకుండానే బాధ్యతలను అప్పగించేస్తున్నారు. బాధ్యతలు చేపట్టిన ఆరు నెలల తర్వాత అంగన్‌వాడి కార్యకర్తలకు వారం రోజులపాటు శిక్షణ కార్యక్రమాన్ని ఏర్పాటు చేయడం అనేక సందేహాలకు తావిస్తుంది. నూతనంగా ఎంపికైన కార్యకర్తలతోపాటు అయిదు సంవత్సరాల నుంచి విధులు నిర్వహిస్తున్న వారిని సైతం శిక్షణ కార్యక్రమానికి రప్పిస్తున్నారు. నెల్లూరు నగరంలోని మహిళా ప్రాంగణం, మురళీకృష్ణ నర్సింగ్ స్కూల్‌లో అంగన్‌వాడి కార్యకర్తలకు శిక్షణ కార్యక్రమాలు జరుగుతుంటాయి. బ్యాచ్‌కు 40 మంది వంతున ఎంపికచేసి ఒక్కో ఐసిడిఎస్ ప్రాజెక్టు నుంచి ఇక్కడకు పంపుతుంటారు.

**స్త్రీ, శిశు సంక్షేమ శాఖలో అంగన్‌వాడీ వర్కర్లకు శిక్షణ పేరిట లక్షలాది రూపాయల నిధుల భక్షణ జరిగింది.**

అయిదు నుంచి ఎనిమిది సంవత్సరాలు పూర్తిచేసుకున్న వారిని కూడా శిక్షణకు పంపి నిధులు ఖర్చు చేస్తున్నారు. మురళీకృష్ణ నర్సింగ్ స్కూల్‌లో ఇందుకు సంబంధించిన శిక్షణ ఇచ్చేందుకు ప్రత్యేకంగా శిక్షకులు ఎవరూ లేనప్పటికీ బయట నుంచి కొంతమందిని తీసుకువచ్చి తూతూ మంత్రంగా కార్యక్రమాన్ని నిర్వహిస్తున్నారు. స్త్రీ, శిశు సంక్షేమ శాఖ ఒక్కో అంగన్‌వాడి కార్యకర్తకు రోజుకు 150 రూపాయల వంతున చెల్లించడం జరుగుతుంది. శిక్షణ పొందే సమయంలో ఒక పూట టిఫిన్, రెండు పూటల భోజనం, వసతి సదుపాయం కల్పించాల్సి వుంటుంది. శిక్షణ కోసం వచ్చినవారికి నాసిరకం భోజనం పెడుతూ రికార్డుల్లో వున్న విషయాలనే చదివి వినిపిస్తున్నారని అంగన్‌వాడి వర్కర్లు వాపోతున్నారు.

ఇదే విషయాన్ని ప్రాజెక్టు పరిధిలో ప్రతినెల నిర్వహించే సెక్టార్, ప్రాజెక్టు సమావేశాలలో సంబంధిత సూపర్‌వైజర్లు, సిడిపిఓలు వివరిస్తే అంగన్‌వాడి కార్యకర్తలకు మంచి అవగాహన వుంటుంది. కార్యకర్తలకు పలు విషయాలు, సందేహాలపై అవగాహన కల్పించాల్సిన సూపర్‌వైజర్లు ఆ దిశగా ఏ ప్రాజెక్టులో కూడా కృషి చేయడం లేదు. ప్రైవేటు సంస్థలకు చెల్లించే నిధులలో కమీషన్ల కోసం కక్కుర్తిపడి అవసరం వున్నా, లేకున్నా అంగన్‌వాడి వర్కర్లను శిక్షణకు పంపుతున్నారు. స్త్రీ, శిశు సంక్షేమ శాఖలో ఎప్పటినుంచో ఈ తతంగం జరుగుతున్నా నియంత్రించేందుకు ఎవరూ చర్యలు తీసుకోవడం లేదు.




నెల్లూరులోని స్త్రీ, శిశు సంక్షేమ శాఖ కార్యాలయం.

ఇదిలా వుండగా జిల్లావ్యాప్తంగా వున్న అంగన్‌వాడి కేంద్రాలకు సరఫరా చేసే సామాగ్రి, స్టేషనరీలో అనేక అక్రమాలు చోటు చేసుకొంటున్నాయి. కాంట్రాక్టర్ల ద్వారా తక్కువ ధరలకు నాసిరకం వస్తువులను సరఫరా చేయించి నాణ్యమైన వస్తువులుగా నమోదు చేస్తుంటారు. దీనికిగాను ఆ సదరు కాంట్రాక్టర్ నుంచి కమీషన్లు పొందుతుంటారు. శిక్షణ పేరుతో జరుగుతున్న నిధుల దుర్వినియోగం, సరఫరా చేస్తున్న సామాగ్రిపై పూర్తిస్థాయి విచారణ జరిపితే మరిన్ని అవినీతి, అక్రమాలు వెలుగుచూసే అవకాశం వుంది.



# మొఖం మొత్తే 'మౌనరాగం'!



✍ అల్లూరు రహీం

లో బడ్జెట్‌లో చిత్రాలు తీసే నిర్మాతలు కూడా కథ పట్ల శ్రద్ధపెట్టక దర్శకుని చేత రీళ్లు చుట్టింపజేస్తే ఆ చిత్రాన్ని జనం చూడబనిలేదా? నిర్మాతలు ఎస్వీ ప్రసాద్, శానం నాగ అశోక్‌కుమార్‌లు వర్ధమాన తారలు తనీష్, మధురిమ, సుహాసినిల కాంబినేషన్‌లో విజయ బాలాజిని దర్శకుని చేసి తీయించిన 'మౌనరాగం' చిత్రంలో పసలేదు. ప్రేమకథా చిత్రమంటే అందులో కనీసం ఐదారు సన్నివేశాలైనా సినిమా చూస్తున్న ప్రేక్షకుల హృదయాలను తాకాలి. కాని అటువంటి సన్నివేశాలేవీ మౌనరాగం చిత్రంలో కానరావు. మామూలుగా ఎస్‌ఏ రాజ్‌కుమార్ సంగీతం సమకూర్చే చిత్రంలో కనీసం రెండు, మూడు పాటలైనా ప్రేక్షకులను రంజింపజేస్తాయి. కానీ మౌనరాగంలో ఆయన సంగీత ప్రతిభ మచ్చుకైనా కానరాలేదు. దీనివల్ల భాస్కరభట్ల, వనమాలిల సాహిత్యం దేనికీ కొరగాకుండా పోయింది. హీరో తనీష్, హీరోయిన్లు మధురిమ, సుహాసినిలలో ఒక్కరూ గ్లామర్‌గా లేక పోవడంతో మౌనరాగం మరింతగా మూగబోయింది. స్క్రీన్‌ప్లే బలహీనపడడం వల్ల వేణు, అలీ, మాస్టర్ భరత్‌ల కాంబినేషన్‌లోని కామెడీ కూడా అంతగా పండలేదు. తనను చిన్ననాటి నుంచి కష్టపడి పోషించడంతోపాటు నిండు మనసుతో ప్రేమించే బావ పట్ల మరదలు అకారణంగా ఎందుకు ద్వేషం ప్రదర్శిస్తుందో అర్థమే కాదు. హీరో మాట్లాడితే మందుకొడతానని చెప్పే సన్నివేశం ఈ కోవలోనిదే. అయితే మాటల రచయిత చింతపల్లి రమణ వ్రాసిన మాటల్లో లవర్ అంటే సంతోషంగా వున్నప్పుడు కౌగిలించుకొని... కష్టాల్లో వున్నప్పుడు వదలివేసే వాడు కాదు. స్టేటస్ ఇంటి ముందు బోర్డులాంటిది. బిజినెస్‌లో సెంటిమెంట్లు వుండవు. ఏమండీ అనే పిలుపు ఆత్మీయులను దూరం చేస్తుందనేది ఆలోచింపజేస్తాయి.




చిత్రకథలోనికి వెళ్తే తల్లితండ్రులు చనిపోవడంతో తన మరదలు కావేరి(సుహాసిని)ని చందు(తనీష్) కష్టపడి చదివిస్తుంటాడు. చందుకు గాయకుడు కావాలని కోరిక. అందుకోసం నానాపాట్లు పడతాడు. రంగారావు(జీవా) నేతృత్వంలో జరిగే వినాయకచవితి ఉత్సవాల్లో చందుకు పాటపాడే అవకాశం వస్తుంది. కో-సింగర్‌గా గుంటూరు నుంచి ఓ యువతిని పిలిపిస్తారు. ఆ యువతి బదులుగా సంధ్య(మధురిమ) వస్తుంది. కాని ఆమెకు పాటలు పాడడం రాకపోవడం వల్ల కార్యక్రమం రసాభాస అవుతుంది. వాస్తవానికి సంధ్య మెకానికల్ ఇంజనీరు. 20వేల రూపాయలతో యువతులు నడిపే బైక్‌ను తయారుచేయాలని ఆమె కోరిక. ఆమె తండ్రి(చంద్రమోహన్)ని వ్యాపారంలో భాగస్తులు దెబ్బ తీయడంతో డబ్బున్న కుటుంబీకుడు గౌతమ్‌తో కుదిరిన పెళ్లి ఆగిపోతుంది. దీంతో మరో మార్గాంతరం లేక ఆమె హైదరాబాద్‌లోని చందు పంచన చేరుతుంది. అతని ఇంటి బాడుగ బకాయి కడుతుంది. అతను మంచి యువకుడని గ్రహిస్తుంది. చందు రెక్కల కష్టంతో చదివిన కావేరి ఆమెకు ఉద్యోగం రాగానే డబ్బున్నవాడిని పెళ్లి చేసుకొంటుంది. దీన్ని భరించలేక రైలు క్రిందపడి చావాలని బయలుదేరే చందును సంధ్య వచ్చి రక్షిస్తుంది. ప్రేమలో దెబ్బతిన్న వాళ్లంతా చనిపోతే దేశమంతా పీనుగల దిబ్బవుతుందంటుంది. సాధించాలనుకొంటున్న లక్ష్యం వైపు అడుగులు వేయమని, ఓ టిఫిన్ సెంటర్ పెట్టుకోమని ఆమె నగలు తీసియిస్తుంది. టిఫిన్ సెంటర్ నడుపుతూ సంధ్య ఆశయాన్ని సాధించను ఆమెను విదేశాలకు పంపుతాడు చందు. అక్కడ ఆమె 20వేల రూపాయలకు స్కూటర్ ప్రయోగాన్ని శాస్త్రజ్ఞులకు చూపించి రాష్ట్రంలోనే ఫ్యాక్టరీ స్థాపనకు హైదరాబాద్ తిరిగి వస్తుంది. అయితే ఆమె పాత ప్రియుడు గౌతమ్‌తో విమానం దిగడంతో చందులో ఆందోళన నెలకొంటుంది. అంతిమంగా అద్భుత స్కూటర్ ఆవిష్కరణ సభలో తన స్ఫూర్తిప్రదాత, హృదయ విజేత కూడా చందు అని చెప్పడంతో మౌనరాగం వీడి వసంత కోయిలల కుహుకుహులు వినపడడంతో చిత్రం ముగుస్తుంది.

హీరో తనీష్ ఈ సినిమాలోనూ ఏడుపుగొట్టు ముఖంతో కనిపిస్తాడు. నెల్లూరు అమ్మాయి సుహాసిని అంతే. మధురిమ మాత్రం పరవాలేదు. మిగతా నటీనటుల గూర్చి చెప్పుకోనవసరం లేదు. ఈ చిత్రం ఇంత బలహీనంగా తయారుకావడానికి దర్శకుడు విజయ్ బాలాజి కారకుడని చెప్పకతప్పదు. J

## హీరోలకు అనుష్క పాఠాలు



తెలుగు చలనచిత్ర పరిశ్రమలో బిజీ హీరోయిన్ అనుష్క తీరిక దొరికినప్పుడల్లా హీరోలకు యోగా పాఠాలు చెబుతుంది. శారీరక వ్యాయామం ఎంత గొప్పదో ఆమె మాటల్లోనే వినాలంటున్నారు అగ్రహీరోలు. రవితేజ, గోపీచంద్, నాగార్జున అనుష్క వద్ద యోగాతోపాటు వ్యాయామంలో మెళకువలు నేర్చుకొన్నారట. అనుష్కకు ఇప్పటికే బెంగుళూరులో చాలామంది శిష్య బృందం వుంది.

## మందుకు బానిసైన హీరోయిన్



ఆది సినిమాలో జూనియర్ ఎన్టీఆర్ సరసన నటించిన కీర్తిచావ్లాకు ఆ చిత్రం మినహా హిట్లు లేవు. దీంతో ఆమె తమిళ పరిశ్రమకు తరలివెళ్లింది. అక్కడ ఎందువల్లో ఈమె తాగుడికి అలవాటుపడిపోయింది. డైరెక్టుగా సెట్స్‌కు వచ్చేటప్పుడు మందుకొట్టి వచ్చేస్తుందట. అసలు ఏమాత్రం జంకు లేకుండా మందుకొట్టి డేర్‌గా వస్తున్న ఈమెను చూసి తోటి ఆర్టిస్టులు, దర్శకులు ఖంగు తింటున్నారు. గ్లామరుండగానే సినిమాలు దక్కించుకొనే ఈ రోజుల్లో ఈ విధంగా తాగి గబ్బు పడుతున్న తారగా కీర్తిచావ్లానే చెప్పుకోవాల్సి వస్తుంది. ఇప్పటికైనా ఆమె తాగుడుమానితే కెరియర్ ముందు కెళ్తుంది. లేకుంటే ఇంకా దిగజారిపోతుందని సినీపరిశ్రమలోని వర్గాలు వాఖ్యానిస్తున్నాయి.

## బ్రహ్మానందంకు భలే డిమాండ్!



హాస్యనటుడు బ్రహ్మానందం డిమాండ్ 'అదుర్స్' సినిమా తర్వాత బాగా పెరిగింది. చిన్నసినిమా పెద్దసినిమా అనే తారతమ్యం లేకుండా రోజుకు నాలుగు లక్షల రూపాయల చొప్పున తన కాల్షీట్స్‌ను అమ్మేసుకొంటున్నాడు. ఈ మొత్తానికి ఒక్క పైసా తగ్గినా కూడా మొహమాటం లేకుండా నో అని చెప్పేస్తున్నాడు. రోజుకు నాలుగు లక్షలు చొప్పున లెక్కపెడితే నెలకు ఈయన గారి సంపాదన కోటి 20లక్షలనవచ్చు. బ్రహ్మానందం నెలసరి సంపాదిస్తున్న మొత్తం మరే తెలుగు హీరోకు రావడం లేదు. చిన్న నిర్మాతలు మాత్రం బ్రహ్మానందంను బుక్ చేసుకోను నానాపాట్లు పడుతున్నారు.



## వైవిధ్యంగా త్రిష

ఏ పాత్రలోనైనా ఇట్టే ఒదిగిపోయే సహజనటి త్రిష. అటువంటి త్రిష ఇటీవల ఒక పత్రికలో సగం దుస్తుల్లో ఫోజులిచ్చి అందరినీ ఆశ్చర్యపరిచింది. హీరోల సరసన గ్లామరస్‌గా నటించినా మరీ అంతగా శృతిమించిన వస్త్రాలు ఆమె ఎప్పుడూ ధరించలేదు. ఇటీవలకాలంలో అందాన్ని మరింత ఇనుమడించే సర్జరీలు చేయించుకున్న త్రిష కొత్తగా వస్తున్న హీరోయిన్లతో పోటీ పడేందుకు ప్రయత్నిస్తుంది. తమిళంలో ఏమాయ చేసావె చిత్రంలో త్రిష కొత్త అందాలతో చాలా ఆకర్షణీయంగా కనపడిందని పరిశ్రమ వర్గాలు చెబుతున్నాయి. తన తరం కథానాయిక శ్రియ లాగా తాను వెనకబడకూడదన్న వుద్దేశ్యంతోనే ఎప్పటికప్పుడు వైవిధ్యంగా కనిపిస్తుందట త్రిష.

## పచ్చిమాంసం తినే జెనీలియా



అందంగా కనిపించే హీరోయిన్ జెనీలియా ఎంచక్కా ఫలాలు, జ్యూస్‌లు తాగి సన్నగా నాజూకుగా వుందని అందరు భావిస్తుంటారు. కాని వాస్తవానికి జెనీలియా పచ్చి మాంసాహారి. ఇటీవల రామ్‌చరణ్‌తేజ సరసన 'ఆరంజ్' చిత్రంలో నటించను జెనీలియా ఆస్ట్రేలియా వెళ్లింది. అక్కడో రెస్టారెంట్‌లో పచ్చిమాంసం, పచ్చిరొయ్యలు, పచ్చిచేపలు ఆర్డర్ ఇచ్చి ప్రశాంతంగా లాగించేసిందట. ఇది చూసి ఈ పచ్చి ఫుడ్ ఐటమ్స్ జెన్నీ ఎలా తిందన్న ఆశ్చర్యాన్ని యూనిట్ సభ్యులు వ్యక్తం చేశారు.

# ట్రాఫిక్‌కు ఎస్పీ మోక్షం


కూరగాయల మార్కెట్ వద్ద రోడ్డు మార్జిన్ వ్యాపారులను ఖాళీ చేయిస్తున్న పోలీసులు.

నెల్లూరు టౌన్‌లో ట్రాఫిక్ సమస్యలకు మోక్షం కల్పించడానికి కొత్త ఎస్పీ దామోదర్ చాలా కష్టపడుతున్నాడు. అన్ని పనులు మాని దీనిమీదనే ఎక్కువ దృష్టి పెడుతున్నారాయన. తన ఒక్కడి ఆలోచన కాకుండా ట్రాఫిక్ మీద అవగాహన వున్న వారి నుంచి సలహాలు, సూచనలు స్వీకరిస్తున్నారు. ఈ వారం ఎస్పీ గారు మూడు ప్రధాన మార్పులు చేశారు. కలెక్టర్ ఆఫీస్ రోడ్డును వన్‌వేగా మార్చడం, టౌన్‌లోకి వచ్చే లారీలకు వేళలు నిర్ణయించడం, ట్రంకురోడ్డులో పాదచారులకు ప్రత్యేక దారి గుర్తు పెట్టడం.

మద్రాసు బస్టాండ్ నుంచి హోటల్ శివం వరకు ఒకేవైపు వాహనాలు నడవాలని నిర్దేశించారు. కలెక్టరేట్ నుంచి మద్రాస్ బస్టాండ్ వైపు వచ్చే వాహనాలు జిల్లాపరిషత్ ఎదురుగా వున్న లీలామహల్ రోడ్డు ద్వారా వెళ్లాలి. హోటల్ శివం రోడ్‌లోకి ప్రవేశించకూడదు. బారకాసు స్టేట్ బ్యాంక్ ప్రాంతంలో వాహనాల పార్కింగ్ నిషేధించారు. ట్రంకురోడ్డుకు ఇటు అటు పాదచారుల కోసం తెల్లరంగుతో కొంత ప్రాంతాన్ని గుర్తు పెడుతున్నారు. ఏ వాహనమైనా ఈ గుర్తు దాటితే ఫైన్ వేస్తారు. అటు అయ్యప్ప దేవాలయం నుంచి, ఇటు పెన్నా బ్రిడ్జి నుంచి లారీల వంటి భారీ వాహనాలు ఉదయం ఏడు గంటల నుంచి రాత్రి తొమ్మిది వరకు టౌన్‌లోకి రాకూడదన్న నిషేధం విధించారు.

ట్రాఫిక్ నిబంధనల అమలుకు ప్రత్యేక బృందాలను నియమించారు ఎస్పీగారు. రోడ్‌మీద, షాపింగ్ కాంప్లెక్స్‌ల ముందు అడ్డదిడ్డంగా పార్క్ చేసే వాహనాలను ఈ బృందాలు స్వాధీనం చేస్కొంటాయి. ఫైన్ కడితేకానీ వదిలి పెట్టవు. ఈ మార్పులతో టౌన్‌కు పట్టిన ట్రాఫిక్ శాపం విమోచనమైపోతుందని చెప్పలేము కానీ, ఏళ్ల తరబడి పురప్రజలను చీకాకు పెడుతున్న ట్రాఫిక్ మహమ్మారిని సరిదిద్దే ప్రయత్నం అభినందనీయం.

# విద్యాశాఖపై జడ్పీచైర్మన్ గరంగరం!

జిల్లా విద్యాశాఖ కార్యాలయంలో పనిచేసే సిబ్బంది మహాముదుర్లు. తిమ్మిని బమ్మిని చేయగల నేర్పరులు. చేయి తడిపితే చాలు ఎంత పనైనా చిటికెలో చేయగల ఘనులు. కార్యాలయ అవినీతిపై పలు ఆరోపణలు రావడంతో గతంలో జిల్లా కలెక్టర్‌గా పనిచేసిన రవిచంద్ర పలుమార్లు తనిఖీచేసి పద్ధతి మార్చుకోమని హెచ్చరించినా వారిలో మార్పు రాలేదు. ఉపాధ్యాయ బదిలీలు, పదోన్నతుల కౌన్సిలింగ్, జాబితా తయారీ తదితర విషయాల్లో కార్యాలయంలో పనిచేసే పాత పందికొక్కులు కొందరు అక్రమాలకు పాల్పడడం, గందరగోళం నెలకొనడం తరచూ చోటుచేసుకొనే అంశం. వీరి అక్రమాలకు విసిగివేసారిన జిల్లా పరిషత్ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి సమావేశం నిర్వహించి తీవ్రంగా మందలించిన ఘటన ఇటీవల జరిగింది. ఉపాధ్యాయులకు పదోన్నతులు కల్పించినపుడు పలువురు టీచర్లు ఆయా ప్రాంతాల్లో చేరకుండా గమ్మునుండిపోయారు. తర్వాత జరిగిన కౌన్సిలింగ్‌లో మంచి ప్రాంతాల్లో చేరేందుకు సిద్ధమయ్యారు. దీనిపై పలువురు తీవ్ర అభ్యంతరం వ్యక్తం చేశారు. ఒకసారి పదోన్నతి లభించినపుడు చేరని వారికి తర్వాత జరిగే బదిలీల్లో ఎలా అవకాశం కల్పిస్తారన్న ఫిర్యాదులు ఉన్నతాధికార్లకు అందాయి. డిఇఓ ఆఫీసు సిబ్బంది కోర్టు పేరుతో కొందరికి అక్రమ మార్గంలో పదోన్నతులు కల్పించడంపై జడ్పీ ఛైర్మన్‌కు ఫిర్యాదులు వెళ్లాయి. దీనిపై ఆయన సమగ్రంగా విచారించారు. పదోన్నతుల లోపాలపై ప్రశ్నించిన కాకాణి ఒక దశలో తీవ్రంగా స్పందించారు. పనితీరు దారుణంగా వుంది. ఫైళ్లు వుంటే కాగితాలు వుండవు, మరికొన్ని సమయాల్లో ఫైళ్లే కన్పించవు. తమాషా చేస్తున్నారా అంటూ మండిపడ్డారు. నిబంధన ప్రకారం వారం రోజుల్లో సీనియారిటీ జాబితా తయారుచేయండని ఆదేశించారు.


విద్యాశాఖ అధికారుల సమీక్షా సమావేశంలో జడ్పీచైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి.

# నాయకులను కాదు పనిని నమ్ముకోండి!

## బదలీ అయిన డ్వామా పి.డి సలహా

ప్రభుత్వ పథకాలు ప్రజలకు అందాలంటే ఉద్యోగులు నిబంధనలకు అనుగుణంగా పనిచేయాలని బదలీపై వెళ్లిన డ్వామా పిడి సుధాకర్‌రెడ్డి వ్యాఖ్యానించారు. వీడ్కోలు కార్యక్రమంలో ఆయన మనస్సు విప్పి మాట్లాడారు. ఉపాధి హామీ పనులు నేతల ప్రమేయం వల్లనే లబ్దిదారులకు అందకుండా పోతున్నాయన్నారు. ప్రజల వలన బ్రతికేవారు నాయకులు, సినిమా వాళ్లు. అలాంటి వారి వలన ప్రజలకు మేలు జరగదు. వారి పాత్ర పరిమితం కావాలి. ఉద్యోగుల వల్లనే అర్హులకు న్యాయం జరుగుతుంది. ఈ విషయాన్ని ప్రతిఒక్కరూ గుర్తుంచుకోవాలని సూచించారు. అధిక భాగం నాయకులు కనీస విద్యార్హతలేని వాళ్లు వున్నారని, ఉద్యోగులు మాత్రం ఉన్నత చదువులు చదివి వుంటారని తెలిపారు. తెలివితేటలు నాయకులకంటే ఉద్యోగులకే అధికమన్నారు. ప్రజలు నాయకులను నమ్మేకంటే పనిని నమ్ముకొంటే మేలు జరుగుతుందని వ్యాఖ్యానించారు. 13నెలల స్వల్ప వ్యవధిలో బదలీ కావడం బాధ కల్గించడంలేదని ఇక్కడి నాయకులు అన్ని నెలలు నన్ను భరించారంటేనే గొప్ప అని అన్నారు. నమ్మిన సిద్ధాంతాలు, నిబంధనల ప్రకారం పనిచేసే వారికి బదలీలు సర్వసాధారణమని, ప్రజలకు సేవచేయడమే బాధ్యత అన్నారు.

# త్రాగునీటి ఎద్దడి నివారణకు 4 కోట్లు!

## ఈ మొత్తం చాలేనా?

జిల్లాలోని గ్రామీణ ప్రాంతాలలో త్రాగునీటి ఎద్దడి నివారణకు రాష్ట్ర ప్రభుత్వం నాలుగు కోట్ల రూపాయలు విడుదల చేయడం జరిగింది. ఇప్పటికే గ్రామీణ ప్రాంతాలలో వివిధ కారణాలతో త్రాగునీటి సరఫరా సక్రమంగా జరగడం లేదు. విద్యుత్ మోటార్లు కాలిపోవడం, పైపులు పగిలి పోవడం, బోర్లు మరమ్మత్తులకు గురయ్యాయి. 12వ ఆర్థిక ప్రణాళిక కింద విడుదలైన నిధులతో పై పనులు చేపడతారు. త్రాగునీటి వనరుల్లేని గ్రామాలను కూడా గుర్తించి ప్రజలకు అవసరమైన త్రాగునీటిని సరఫరా చేయాలని ప్రభుత్వం ఆదేశించింది. కాలనీల ప్రజలకు నీటి సమస్య తలెత్తకుండా రెండు వందల మీటర్ల దూరం నిర్దిష్టంగా చేసుకుని పైపులైన్ విస్తరణ పనులు చేపట్టాలని ప్రభుత్వం నిర్ణయించింది. ఇందుకు సంబంధించిన ఉత్తర్వులు జిల్లా కలెక్టర్‌కు ఇటీవల అందాయి. ఉత్తర్వులు అందుకున్న కలెక్టర్ గ్రామీణ నీటి సరఫరా విభాగం, మునిసిపాలిటీ అధికారులతో సమీక్షా సమావేశం ఏర్పాటుచేసి త్రాగునీటి ఎద్దడి నివారణకు తీసుకోవాల్సిన చర్యలపై చర్చించడం జరిగింది. ప్రతి మండలంలో త్రాగునీటి సమస్యపై 15 రోజులకోసారి ప్రజా ప్రతినిధులతో సమావేశాలు నిర్వహించి సమస్యను పరిష్కరించే విధంగా ప్రణాళికలు తయారుచేశారు.

# ప్రైవేట్ విద్యాసంస్థల గుప్పెట్లో పరీక్షలు

ప్రభుత్వం నిర్వహించే పరీక్షలు ప్రైవేట్ విద్యాసంస్థల చెప్పుచేతల్లోకి వెళ్లాయనేది ఇటీవల జరిగిన పరీక్షల తీరుతెన్నులను పరిశీలిస్తే అవగతమవుతుంది. పబ్లిక్ పరీక్షలైన పదవ తరగతి, ఇంటర్మీడియట్ పరీక్షలు విద్యార్థులకు ఎంతో కీలకమైనవి. వారి భవిష్యత్తుకు సంబంధించి ముఖ్యమైన పరీక్షలు. అధిక మార్కులు తెచ్చుకోవాలని ప్రతి విద్యార్థి కోరుకొంటాడు. దానికి తగినట్లు కష్టపడతారు. ప్రైవేట్ విద్యాసంస్థల పుణ్యమా అని ఇప్పుడు ఈ పరీక్షలు పిల్లలకంటే విద్యాసంస్థల యాజమాన్యాలకు కీలకమయ్యాయి. అత్యధిక మార్కులు తెచ్చుకొని తమ ఆదాయాన్ని పెంచుకొనేందుకు పలువురు కరస్పాండెంట్లు అడ్డదారులు తొక్కడంతో పరీక్షల్లో అక్రమాలు జోరందుకొన్నాయి. విద్యాశాఖ అధికారులు, సిబ్బందితో లాలూచీపడి విద్యాసంస్థల యాజమాన్యాలు బహిరంగంగా కాపీయింగ్‌కు సిద్ధపడ్డాయి. జిల్లావ్యాప్తంగా జరిగిన టెన్త్, ఇంటర్‌తోపాటు డిగ్రీ పరీక్షలలోనూ ఇదే తంతు. పదవ తరగతి పరీక్షలకు సంబంధించి ఇన్విజిలేటర్లు, డిపార్టుమెంటల్ ఆఫీసర్ల నియామకాలు ఎవరికీ తెలియకుండా వుండేందుకు లాటరీ పద్ధతి ద్వారా పరీక్షకు గంట ముందు డ్యూటీలు వేస్తారు. కానీ ఆ విధానం అమలుకాలేదు. తమకు నచ్చినవారిని, అనుకూలంగా వ్యవహరించే వారిని తమ విద్యార్థులు పరీక్ష వ్రాసే కేంద్రాలలో వేయించుకొనేందుకు ప్రైవేట్ విద్యాసంస్థల కరస్పాండెంట్లు పెద్దఎత్తున డబ్బులు వెదజల్లారనేది తెలిసిన సంగతే. ఇలాంటి వాటిని అరికట్టాల్సిన విద్యాశాఖాధికారులు కొందరు కార్పొరేట్ విద్యాసంస్థలు విధిలించే లంచాలకు కక్కుర్తి పడడంతో ఈ సంవత్సరం జరిగిన మూడు పరీక్షల్లో అక్రమాలకు అడ్డులేకుండా పోయింది.

# బోరు బావులపై సర్వే

## [ భూగర్భ జలశాఖ నిర్ణయం ]

జిల్లాలో సాగునీటి కోసం వ్యవసాయ భూముల్లో బోరు బావుల ఏర్పాటుకోసం సర్వే చేయించేందుకు ప్రభుత్వం నిర్ణయించింది. ఎ.పి.వాల్టా చట్టం ద్వారా భూగర్భజల శాఖ ఆధ్వర్యంలో ఈ సర్వే కార్యక్రమం జరుగనుంది. బోరుబావులు ఏర్పాటు చేసుకోదలచిన రైతులు ముందుగా దరఖాస్తు చేసుకోవాలి. షెడ్యూల్డు కులాలకు చెందిన రైతులు ఎస్సీ కార్పొరేషన్ ద్వారా, షెడ్యూల్డు తెగలకు చెందిన రైతులు ఐటిడిఏల ద్వారా దరఖాస్తులు పంపుకోవాల్సి వుంటుంది. ఇతర కులాలకు చెందిన సన్నకారు రైతులు 500 రూపాయలు, పెద్ద రైతులు 1000 రూపాయలు దరఖాస్తు రుసుంగా చెల్లించాలి. భూగర్భజల శాఖ అధికారులు సర్వే నిర్వహించి నీరు ఎక్కడ లభ్యం అవుతుంది, ఎన్ని అడుగుల లోతున నీరు వస్తుంది అని నిర్ణయిస్తారు. నీటి పరీక్షలను కూడా నిర్వహించే అవకాశం వుంటుంది. దరఖాస్తు చేసిన 15 రోజుల నుంచి 30 రోజులలోపు సర్వే చేపడతారు. జిల్లాలో అవసరమైన రైతులు ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలని అధికారులు కోరుతున్నారు.


నెల్లూరులోని జైన్‌గోల్డ్‌లో నిర్వహించిన లక్కీడ్రాలో విజేత బి.సింధుకు స్కూటీని అందజేస్తున్న బొమ్మిరెడ్డి వెంకురెడ్డి. ప్రక్కన జైన్‌గోల్డ్ అధినేత మణిలాల్‌జైన్ వున్నారు.

## మాయ చేస్తున్నాడా?

మొదటి పేజీ కొరవ

వచ్చిన ఉత్సాహంతో జగన్‌తో కలిసి విరుచక పడతారు. ఆ ఒత్తిడి తట్టుకొనే సామర్థ్యం తనకు లేనందువల్లనే రోశయ్య మంత్రివర్గ విస్తరణ విషయంలో ఆచితూచి అడుగులు వేస్తున్నాడన్నది ఒక వాదన. అది నిజం కూడా అయి వుండవచ్చు. చెన్నారెడ్డి, విజయభాస్కర్‌రెడ్డిల హయాంలో వైఎస్ చేసిన ఆగం ప్రత్యక్షంగా చూసిన వాడాయన. అయితే అప్పటికి ఇప్పటికి ఒక ప్రధాన తేడా వుంది. ఇందిరా, రాజీవ్ గాంధీలిద్దరూ రాష్ట్రస్థాయిలో నాయకులు స్థిరపడకుండా చూడడం కోసం అసమ్మతికి ఒక చెవి ఇచ్చి వినేవారు. కానీ సోనియాగాంధీ ఆ పద్ధతికి పూర్తి విరుద్ధం. ఆమె పెట్టిన ఏ ముఖ్యమంత్రిని కూడా నిండు ఐదేళ్లు కదిలించిన దాఖలా లేదు. ఏ రాష్ట్రంలోను అసమ్మతిని ప్రోత్సహించలేదు. రోశయ్య ఆమె స్వంత మనిషి. ఆయన నుంచి ఏ రకంగానూ ప్రమాదం రాదన్న సంగతి ఆమెకు బాగా తెలుసు. అందువల్ల రాష్ట్రంలో ఎందరు మంత్రులు మాజీలుగా మారి గోల చేసినా ఆమె వినిపించుకోదు. విన్నా పట్టించుకోదు. అధిష్టానం అనుగ్రహం లేకుండా ఎంత అసమ్మతి కూడా అరణ్యరోదనేనౌతుందే తప్ప ఫలితం రాదు. అయినా లేనిపోని తలనొప్పి కొని తెచ్చుకోవడం ఎందుకు, ఎవరు మంత్రులుగా వుంటే నాకేమి అనే ధోరణి ముఖ్యమంత్రి అవలంభిస్తున్నాడా?

### స్వంతవారి సంగతేమిటి?

ముఖ్యమంత్రి కుర్చీలో తామరాకు మీద నీటి బొట్టు వలె తాత్వికతత్వంతో కూర్చున్నట్లు కనపడుతున్నప్పటికీ రోశయ్యకు స్వంత ఇష్టాఇష్టాలున్నాయి. తన మంత్రివర్గంలో తన స్వంత మనుషులను పెట్టుకోవాలన్న కోరిక చాలా బలంగా వుంది. జెసి.దివాకర్‌రెడ్డి, మర్రి శశిధర్‌రెడ్డి, ఎన్.కిరణ్‌కుమార్‌రెడ్డి, టిజి.వెంకటేష్ వంటి వారిని క్యాబినెట్‌లోకి తీసుకొంటే తప్ప, రాజకీయంగా తాను స్థిరపడే అవకాశం లేదని ఆయన చాన్నాళ్ల నుంచి భావిస్తున్నాడు. ఆ మేరకు స్పష్టమైన సంకేతాలు కూడా ఇచ్చాడు. విస్తరణ వాయిదా వేయడమంటూ జరిగితే ఈ స్వంత అనే ఆలోచనకు స్థానం లేకుండా పోతుంది. అందువల్ల కనీసం తనవారనుకొన్న నలుగురైదుగురు కొత్తవారిని తప్పకుండా చేర్చుకొంటాడన్న అభిప్రాయం ఒకటి వుంది.

### రెడ్ల చిక్కు

అయితే అందులోనూ ఒక చిక్కు వుంది. రాష్ట్ర క్యాబినెట్‌లో ఇప్పుడు 11 మంది రెడ్లున్నారు. (కోమటిరెడ్డి వెంకటరెడ్డి, డికె.అరుణ, పీలేరు రామచంద్రారెడ్డి, శిల్పా మోహన్‌రెడ్డి, సుదర్శన్‌రెడ్డి, సునీతా లక్ష్మారెడ్డి, సబితా ఇంద్రారెడ్డి, గాదె వెంకటరెడ్డి, ఆనం రామనారాయణరెడ్డి, బాలినేని వాసు, రామిరెడ్డి వెంకటరెడ్డి) మొత్తం 34 మందిలో ఇది 33 శాతంతో సమానం. వైఎస్.రాజశేఖర్‌రెడ్డి ఏ సాంప్రదాయాన్నీ లెక్క చేయని వ్యక్తి కాబట్టి, తెగించి ఇంతమంది రెడ్లను తీసుకొన్నాడు. అంత సాహసం రోశయ్యకు లేదు. ఆయన తన స్వంత మనుషులనుకొంటున్న మర్రి శశిధర్‌రెడ్డి, జెసి.దివాకర్‌రెడ్డి, కిరణ్‌కుమార్‌రెడ్డి వంటి వారు కూడా రెడ్లే. వారిని ఇప్పుడున్న వారితో జత చేస్తే ఆ కులం సంఖ్య మరీ ఎక్కువై పోతుంది. దాన్ని సర్దుబాటు చేయాలంటే, కొంతమందినైనా తొలగించక తప్పదు. అది చేయడం అంటే మంత్రివర్గాన్ని ప్రక్షాళన చేయడం క్రిందనే లెక్క. ప్రక్షాళన లేకుండా తన వారికి అవకాశం ఇవ్వడం అసాధ్యం. పెద్ద చిక్కు సమస్యే పాపం.

### ఎంతమందికి అవకాశం?

పాతవారిని తీయకుండానే కొత్త వారిని ఎంతమంది వరకు చేర్చుకోవచ్చు అన్నది ప్రశ్న. రాజ్యాంగం 97 సవరణ ప్రకారం శాసనసభ సభ్యులలో 15శాతం లేదా శాసనసభ, శాసనమండలి సభ్యుల మొత్తం సంఖ్యలో 10శాతం దాటకుండా మంత్రులను నియమించుకోవచ్చు. కేవలం శాసనసభను పరిగణిస్తే 44 మందికి అవకాశం. రెండు సభలు కలిపితే 39కి పరిమితం. శాసనసభసభ్యుల సంఖ్యానియమం ప్రకారం వెళ్దామనుకొంటే, ఇప్పుడు క్యాబినెట్‌లో మొత్తం 34 మంది మాత్రమే వున్నారు కాబట్టి, మరొకపది మంది వరకు కొత్తవారిని చేర్చుకోవచ్చు. రెండు సభల సంఖ్య పాటించినా మరొక 5 మందికి అవకాశం వుంటుంది. కొత్తగా పది మందిని తీసుకొనే అవకాశం వున్నప్పుడు పాత వారిని పీకి, లేనిపోని తలనొప్పి తెచ్చుకోవడం ఎందుకన్న ఆలోచన రోశయ్యలో కల్గివున్నా ఆశ్చర్యం లేదు.

### శాఖల మార్పు ఖాయం

ఏ కారణం వల్లనైనా జగన్ అనుచరులనుకొన్న వారిని మంత్రివర్గం నుంచి తీసివేయలేని పక్షంలో, ఆ కోవకు చెందిన వారి శాఖలలో కోత పెట్టడం ఖాయమని మాత్రం చెప్తున్నారు. తన వ్యతిరేకులనుకొన్న వారిని ప్రధాన శాఖల నుంచి తప్పించి, ప్రాముఖ్యత లేని శాఖలిచ్చి, నామమాత్రంగా మిగులుస్తాడని తెలుస్తున్నది. గతంలో నాదెండ్ల భాస్కరరావు విషయంలో మర్రి చెన్నారెడ్డి ఇదే పోకడ అవలంభించాడు. అప్పట్లో ఆయనకు ఆ సలహా ఇచ్చింది రోశయ్యే అని చెప్తారు. ఇప్పుడు తన సలహాను తనే పాటించబోతున్నాడు.

### రాజ్యసభ అడ్డంకి

మంత్రివర్గ విస్తరణ వాయిదా వేయడానికి పై నెలలో జరగనున్న రాజ్యసభ ఎన్నికలూ ఒక కారణమని చెప్తున్నారు. మొత్తం ఆరు సీట్లలో కాంగ్రెస్‌కు మూడు మాత్రమే నికరంగా గెలుచుకొనే వీలు వుంది. కానీ ఐదు మంది ఇదే సమయంలో మాజీలౌతున్నారు. వీరిలో ఎవరికి కోత పెట్టాలి అన్నది సోనియాగాంధీకి పెద్ద సమస్య. మరొకప్రక్క దక్కన్ క్రానికల్ పత్రిక అధిపతి టి.వెంకటరామరెడ్డి స్వతంత్ర అభ్యర్థిగా రంగంలోకి దిగనున్నాడని తెలుస్తున్నది. ఒక ఓటుకు రెండు కోట్ల వరకు చెల్లించడానికి ఆయన సిద్ధపడుతున్నాడట. కాంగ్రెస్, టిడిపి మిగులు ఓట్లు, ప్రజారాజ్యం, మజ్లిస్‌లు కలిస్తే ఆయన ఆరవ అభ్యర్థిగా గెలుస్తాడు. అయితే కాంగ్రెస్‌లో ఏ అభ్యర్థికి కేటాయించిన ఓట్లను కొల్లగొడతాడో తెలియదు. రెండు కోట్లంటే, ఆశపడని ఎమ్మెల్యేలు ఎవరున్నారు? ఈ పరిస్థితిలో మంత్రివర్గ విస్తరణ జరిపి, మంత్రులను పూడబెరికి, చిక్కులు తెచ్చుకోవడం కంటే, ఒక నెల రోజుల పాటు వాయిదా వేస్తే నష్టమేమిటన్నది సోనియాగాంధీ ఆంతర్యమట. మొత్తం మీద మంత్రివర్గ విస్తరణ, లేదా ప్రక్షాళన విషయంలో అందరినీ గందరగోళంలోకి నెట్టాడు రోశయ్య. ఒక పథకం ప్రకారం, తన మీద ఒత్తిళ్ల పెరగకుండా చూసుకోవడం కోసం కావాలనే ఇట్లా మాట్లాడుతున్నాడన్నది పరిశీలకుల అనుమానం. అందరినీ ఆదమరపులోకి నెట్టి, హఠాత్తుగా క్యాబినెట్ విస్తరణ చేపట్టి, అదురు దెబ్బ కొడతాడని భావిస్తున్నారు. ఆ శుభ ముహూర్తం ఎప్పుడో చెప్పలేము.

## ఎవరికి అదృష్టం

మొదటి పేజీ కొరవ

అయితే ఇదే ఆలోచనలో వి.హనుమంతరావు పేరు కూడా వినపడుతున్నది. రాజ్యసభ సభ్యుడిగా రిటైర్ కాబోతున్నాడాయన. మరొకసారి అదే అవకాశం ఇచ్చే కంటే శాసనమండలికి గెలిపించి, ఉప ముఖ్యమంత్రిని చేస్తే బాగుంటుందని సోనియాగాంధీ తలంపని చెప్తున్నారు. సోనియా కుటుంబానికి విహెచ్‌కు చాలా దగ్గరి సంబంధాలున్నాయి. ఆయన్ను తమ కుటుంబంలో ఒకడిగా చూస్తారు సోనియా, ప్రియాంక, రాహుల్ గాంధీలు ముగ్గురూ. అంత నమ్మకస్తుడికి అవకాశం ఇవ్వడం వారికి ఇష్టమే కదా? పైపెచ్చు జగన్ వల్ల తలెత్తే సమస్యలను ఢీకొనే ధైర్యం, తెగువ విహెచ్ ఒక్కడికే వున్నాయన్న భావన కూడా వుంది.

డిఎస్, విహెచ్‌లలో ఎవరిని పదవీ భాగ్యం వరించనుందో వెండితెర మీద చూడాల్సిందే.

## మదపిచ్చా?

16వ పేజీ కొరవ

లాగా, వివేకా దాదా ఎంబిబిఎస్ వేషం కట్టాడన్న మాట. వైద్య విద్య చదవని, శిక్షణ పొందని వాళ్లు ఇంజెక్షన్ వేయడం, అందులోనూ వాక్సిన్ వంటి ప్రమాదకర మందును పిల్లల శరీరంలోకి ఎక్కించడం చాలా పెద్ద నేరం. ఏ వైద్య చట్టం కూడా దాన్ని అనుమతించదు. అదే సభలో వున్న డిఎంహెచ్‌ఓ వంటి వైద్య అధికారులు, డాక్టర్లు ఎమ్మెల్యేకు అడ్డు చెప్పలేకపోయారు. ఆనం రామనారాయణరెడ్డి కుమారుడి వివాహ నిశ్చితార్థానికి నెల్లూరు వచ్చిన రాష్ట్ర వైద్య విద్యామంత్రి సుదర్శన్ రెడ్డి ఈ విషయం తెలిసి, అధికారులను తీవ్రంగా మందలించాడట. అయితే అధికారులేమి చేయగలరు చెప్పండి?

వివేకానందరెడ్డి పిచ్చి చేష్టలు, మదించిన పోకడలు చూస్తుంటే వళ్లు మండిపోతున్నది. జైలులోనో, లేదంటే పిచ్చాస్పత్రిలోనో వుండవలసిన ఇటువంటి దగుల్బాజీ వెధవలను ఎమ్మెల్యేలుగా గౌరవించి, నెత్తిన పెట్టుకొని వూరేగవలసి రావడం నెల్లూరు జిల్లా ప్రజలు చేసుకొన్న దౌర్భాగ్యం.

## నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

### డ్వామా పిడిగా రామిరెడ్డి

జిల్లా నీటి యాజమాన్య సంస్థ ప్రాజెక్ట్ డైరక్టర్‌గా బి.రామిరెడ్డి 9వ తేది బాధ్యతలు స్వీకరించారు. జడ్పీ సిఇఓగా పనిచేస్తున్న ఈయన్ను డ్వామాకు మార్చారు.

### బిజెపి రాష్ట్ర కమిటీలో నెల్లూరీయులు!

బిజెపి రాష్ట్ర అధ్యక్షుడు కిషన్‌రెడ్డి ప్రకటించిన పార్టీ రాష్ట్ర కార్యవర్గంలో పలువురు నెల్లూరు నేతలకు చోటు దక్కింది. సన్నపరెడ్డి సురేష్‌రెడ్డిని పార్టీ రాష్ట్ర అధికార ప్రతినిధిగా నియమించారు. పార్టీ రాష్ట్ర కార్యవర్గ సభ్యులుగా కందుకూరు సత్యనారాయణ, సురేంద్రరెడ్డి, కోటకు చెందిన కోటేశ్వరరావు, మహిళా నేతలు కె.విజయలక్ష్మి, హేమలతలను నియమించారు. దువ్వూరు రాధాకృష్ణారెడ్డి, రఘునాధరాజులను రాష్ట్ర కార్యవర్గ సమావేశాలకు శాశ్వత ఆహ్వానితులను చేశారు.

### అండర్ బ్రిడ్జి వద్ద దెబ్బతిన్న రోడ్డు!

నెల్లూరు ఆత్మకూరు బస్టాండ్ వద్ద వున్న రైల్వే అండర్ బ్రిడ్జి కింద రోడ్డు బాగా దెబ్బతినిపోయింది. గుంటలు పడిపోవడంతో వాహనదారులు నానాపాట్లు పడుతున్నారు. రెండు మాసాలుగా ఈ పరిస్థితి కొనసాగుతున్నా పట్టించుకునే నాధుడే లేకపోవడం బాధాకరం. తక్షణం ఈ రోడ్డుకు మరమ్మత్తులు చేయించాల్సి వుంది.

### 23న బడ్జెట్ సమావేశం

నెల్లూరు కార్పొరేషన్ బడ్జెట్ సమావేశం ఈ నెల 23వ తేది జరుగుతుంది. ఈ సమావేశం ఆలస్యంగా పెట్టడంతో మేయర్‌పై ప్రతిపక్షాలు కారాలు మిరియాలు నూరుతున్నాయి. సెప్టెంబర్ నెలలో కార్పొరేషన్ ఎన్నికలు జరుగుతున్న దృష్ట్యా ఈ పాలక వర్గానికి ఇదే చివరి బడ్జెట్ సమావేశమనొచ్చు.

### సొంత కుంపటికే ఓదార్పు యాత్ర!

కడప ఎమ్పీ వైఎస్ జగన్మోహన్‌రెడ్డి రాష్ట్రంలో సొంత పార్టీ పెట్టుకొనే యోచనతోనే ఓదార్పు యాత్ర చేపడుతున్నట్లు తెలుగుదేశం పార్టీ జిల్లా అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి విమర్శించారు. 12వ తేది నెల్లూరులోని పార్టీ కార్యాలయంలో విలేకరులతో మాట్లాడారు. రైతులకు గిట్టుబాటు ధర కల్పించడంలో ప్రభుత్వం పూర్తిగా విఫలమయ్యింది. నెల్లూరు జిల్లా రైతులే 200కోట్ల రూపాయలు నష్టపోయారు. ఉపాధి హామీ పథకాన్ని కాంగ్రెస్ కార్యకర్తలు తమకు అనుకూలంగా మలచుకొని బొక్కేస్తున్నారని విమర్శించారు. రాష్ట్రంలో పరిపాలన లేదని జగన్ – రోశయ్య వర్గాల మధ్య పోరు నడుస్తుందని చెప్పుకొచ్చారు.

### కవిత్రయ జయంత్యుత్సవాలు

తిక్కవరపు రామిరెడ్డి కవిత్రయ జయంతి సంఘం నేతృత్వంలో కవిత్రయ జయంత్యుత్సవాలు ఈ నెల 23, 24, 25 తేదీల్లో టౌన్‌హాల్‌లో జరుగుతాయి. 23వ తేది జరిగే నన్నయ జయంతి సభలో ధర్మపురి లక్ష్మీనరసింహస్వామి సంస్కృతాంధ్ర కళాశాల ప్రధాన ఆచార్యులు డాక్టర్ సంగనభట్ల నరసయ్య నన్నయ కవితా వైదుష్యంపై మాట్లాడతారు. 24వ తేది జరిగే ఎర్రాప్రగడ జయంతి సభలో పద్మావతి మహిళా కళాశాల ఆచార్యులు మూలె విజయలక్ష్మి ఎర్రన కవితా వైశిష్ట్యాన్ని వివరిస్తారు. 25వ తేది జరిగే తిక్కన జయంతి ఉత్సవంలో కాకినాడకు చెందిన డాక్టర్ కడిమెళ్ల వరప్రసాద్ తిక్కన కవితా వైభవాన్ని వివరిస్తారు. సాహిత్యాభిమానులను ఈ సభలకు తరలిరమ్మంటున్నారు. కవి త్రయ జయంత్యుత్సవాల కమిటీ అధ్యక్షులు పి.వి.రమణారెడ్డి.

# సానియామీర్జా పెళ్లిపై రాద్ధాంతం!

ఎట్టకేలకు చిట్టచివరకు హైదరాబాదు టెన్నిస్ స్టార్ సానియామీర్జా, పాక్ క్రికెటర్ షోయబ్‌మాలిక్ ఒకటయ్యారు. వీరిరువురూ పెళ్లి చేసుకోవాలని భావించడంతో ఇరు దేశాలలోనూ సంచలనం అయ్యింది. ఎందరో యువకుల కలల రాణైన సానియా టెన్నిస్‌లో తనదైన శైలిలో రాణించడంతోపాటు తన గ్లామర్‌తో పలు కంపెనీలకు బ్రాండ్ అంబాసిడర్ అయింది. మొదటిగా బేకరీ నిర్వాహకుడి కుమారుడితో నిశ్చితార్థం జరిగినా తర్వాత అది రద్దయ్యింది. పాకిస్తాన్ క్రికెట్ ఆటగాడు షోయబ్‌మాలిక్‌ను మనువాడేందుకు ఇష్టపడింది. రెండు కుటుంబాలు అంగీకరించడంతో ఇరువురు ఒకటయ్యేంతలో ఎన్నో అడ్డంకులు, సమస్యలు. షోయబ్ అంతకుముందే హైదరాబాద్‌కు చెందిన యువతిని వివాహమాడాడన్న విషయం బట్టబయలు కావడంతో గగ్గోలు రేగింది. ఆమె తరపువారు పోలీసులకు ఫిర్యాదు చేయడంతో షోయబ్‌కు కష్టాలు మొదలయ్యాయి. ఆయన పాస్‌పోర్టు స్వాధీనం చేసుకున్న పోలీసులు విచారణ చేపట్టారు. మతపెద్దలు, కొందరు మంత్రులు రాజీ చేయడంతో మొదటి భార్యకు తలాక్ చెప్పడంతో సానియా, షోయబ్‌ల పెళ్లికి మార్గం సుగమమైంది. తాజ్‌కృష్ణ హోటల్‌లో సన్నిహితులు, కుటుంబసభ్యుల నడుమ 12వ తేది వివాహం జరిగింది. పెళ్లి తర్వాత సానియామీర్జా, షోయబ్‌మాలిక్ ఇద్దరూ దుబాయ్‌లో కాపురం పెట్టనున్నారని, భవిష్యత్తులో సానియా పాకిస్తాన్ తరపున టెన్నిస్ ఆడనుందనే ప్రచారంపై పలువురు తమ అభిప్రాయాలను వ్యక్తం చేశారు.



### తప్పేముంది?



భారత టెన్నిస్‌స్టార్ సానియామీర్జా పాకిస్తాన్ క్రికెటర్ షోయబ్‌మాలిక్‌ను పెళ్లాడితే తప్పేముంది. వివాహం అనేది ఆమె వ్యక్తిగత విషయం. ఆమె పెళ్లికి, ఇరు దేశాల మధ్య సంబంధాలకు ముడిపెట్టడం సబబుకాదు. భారత, పాకిస్తాన్‌లకు చెందిన ఇద్దరు సెలబ్రిటీలు దంపతులు కావడం సంతోషించాల్సిన అంశం. దీనివల్ల ఇరుదేశాల ప్రజల మధ్య స్నేహ సౌభ్రాతృత్వాలు పెరుగుతాయనే చెప్పాలి. ఆమె ఏ దేశం తరపున ఆడినా, ఎక్కడ వున్నా భారతీయురాలే.

**– బి.సురేంద్ర,** నెల్లూరు.

### దేశంలో ఎవరూలేరా?



భారతీయురాలై వుండి, దేశం తరపున క్రీడల్లో ప్రాతినిధ్యం వహిస్తున్న సానియామీర్జా అకస్మాత్తుగా పాకిస్తాన్ దేశస్తుడిని పెళ్లాడటం బాధాకరం. దేశం ఆమెకు ఎంతో చేసింది. సమాజంలో అత్యున్నత స్థానం కట్టబెట్టింది. అలాంటిది మనదేశంపై ఉగ్రవాదాన్ని ప్రోత్సహిస్తూ, పలురకాలుగా దేశాన్ని దెబ్బతీయాలని చూసే దేశస్తుడు, క్రికెటర్ షోయబ్‌మాలిక్‌ను పెళ్లాడడం దేశ ప్రజలు తట్టుకోలేకపోతున్నారు.

**– కె.రమణారెడ్డి,** నెల్లూరు.

### ఎవరినైనా పెళ్లాడవచ్చు!



సానియామీర్జా, పాక్ క్రికెటర్ షోయబ్‌మాలిక్‌ను వివాహమాడడంలో ఎలాంటి తప్పులేదు. ఇది రెండు మనసులకు సంబంధించిన అంశం. ఒకరినొకరు ఇష్టపడి పెళ్లి చేసుకొన్నారు. ప్రజాస్వామ్యదేశంలో ఏ దేశీయుడినైనా పెళ్లిచేసుకొనే వీలుంది. ఎంతోమంది విదేశీయుల్ని వివాహమాడడం తెలిసిందే. వారి విషయంలో లేని అభ్యంతరం సానియా పెళ్లిలో ఎందుకు. ఏ దేశంలో వున్నా భారతదేశం తరపునే టెన్నిస్ ఆడాలి. అది ఆమె కనీస బాధ్యత.

**– జి.రవిచంద్ర,** నెల్లూరు.

# కార్పొరేషన్ స్టాండింగ్ కమిటీ సమావేశంలో మేయర్‌ను నిలదీసిన ప్రతిపక్షం!

మునిసిపల్ కార్పొరేషన్ స్టాండింగ్ కమిటీ సమావేశంలో మేయర్ ఇబ్బంది పడక తప్పలేదు. కార్పొరేషన్ సమావేశ మందిరంలో ఈనెల 8వ తేది స్టాండింగ్ కమిటీ సమావేశం జరిగింది. ఈ సమావేశానికి హాజరైన సిపిఎం కార్పొరేటర్ కత్తి శ్రీనివాసులు, టిడిపి కార్పొరేటర్ రూప్‌కుమార్ యాదవ్‌లు మేయర్ భానుశ్రీ పనితీరుపై విరుచుకపడ్డారు. స్టాండింగ్ కమిటీ సమావేశం, బడ్జెట్ సమావేశాలు ప్రభుత్వ నిబంధనలకు అనుగుణంగా ఎందుకు నిర్వహించలేకపోయారని ప్రశ్నించారు.

కార్పొరేషన్ బడ్జెట్ సమావేశం డిసెంబర్ నెలలో నిర్వహించి ఆమోదం పొందాల్సి వుండగా ఆ దిశగా పాలకవర్గం కృషి చేయలేదు. ఫలితంగా కార్పొరేషన్‌లో నిధులు ఖర్చు చేయలేక పనులు నిలిచిపోయాయి. మార్చినెలలో మేయర్ భర్త సుబ్బరాజు ఆదాయానికి మించి ఆస్తులు సంపాదించారన్న కారణంపై అవినీతి నిరోధకశాఖ అధికారులు అరెస్టు చేసి చర్లపల్లి జైల్లో రిమాండ్‌లో వుంచిన విషయం అందరికి తెలిసిందే. భర్తను జైలు నుంచి విడుదల చేయించుకునేందుకు మేయర్ నెల్లూరును వదిలి దాదాపు 20 రోజులుపాటు హైదరాబాదులో మకాం పెట్టాల్సి వచ్చింది.

ఈ సమయంలో కార్పొరేషన్ కార్యాలయంలో పరిపాలన గురించి పట్టించుకునే దిక్కులేకుండా పోయారు. దీంతో నగరంలో అనేక



స్టాండింగ్ కమిటీ సమావేశంలో కమిషనర్, మేయర్‌ను నిలదీస్తున్న డివిజన్ ఛైర్మన్‌లు కత్తి శ్రీనివాసులు, రూప్‌కుమార్ యాదవ్.

పనులు పెండింగ్‌లో పడ్డాయి. మేయర్ నగరానికి వచ్చిన తర్వాత ఏర్పాటుచేసిన స్టాండింగ్ కమిటీ సమావేశంలో ప్రతిపక్ష కార్పొరేటర్ల నుంచి విమర్శలు ఎదుర్కోక తప్పలేదు. స్టాండింగ్ కమిటీ అనుమతి లేకుండానే లక్షలాది రూపాయల నిధులను వివిధ పనుల కోసం అధికారులు ఖర్చు చేసినట్లు స్టాండింగ్ కమిటీ అజెండాలో చేర్చారు. ఇలా ఖర్చు చేయడం నిబంధనలకు విరుద్ధమంటూ కార్పొరేటర్లు నిరసన వ్యక్తం చేసినా మేయర్ ఎటువంటి సమాధానం చెప్పకుండా మౌనంగా వుండిపోవాల్సిన పరిస్థితి ఏర్పడింది.

అత్యవసరమైన పనులు చేపట్టేందుకు అవసరమని భావిస్తే నిధులు ఖర్చుకు ముందస్తు అనుమతినివ్వవచ్చు. అయితే హెల్త్ విభాగంలో ఖర్చు చేసినట్లు చూపిన పద్దులు అత్యవసరాలు కావు. దీనిపై సభ్యులు లేవనెత్తిన పలు అంశాలపై మేయర్ భానుశ్రీతోసహా కమిషనర్ సైతం మిన్నకుండిపోయారు. హెల్తు ఆఫీసర్ సుబ్బరాజు కుక్కలు, కోతులు నిర్మూలన కోసం లక్షలాది రూపాయలు ఖర్చు చేసినట్లు చూపారు. ఎవరి అనుమతితో నిధులు ఖర్చు చేశారని నిలదీసినప్పటికి ఒక్కరు కూడా సమాధానం చెప్పలేకపోయారు. ఒక సందర్భంలో ప్రతిపక్షసభ్యులు మేయర్‌కు మధ్య వాగ్వివాదం చోటు చేసుకొంది.

మొత్తం అయిదుగురు సభ్యులున్న స్టాండింగ్ కమిటీలో ముగ్గురు సభ్యులు అధికారపక్షానికి చెందినవారు కాగా మిగిలిన ఇద్దరు సభ్యులు ప్రతిపక్షాలకు చెందినవారు. అధికారపక్షానికి చెందిన ముగ్గురు సభ్యులలో ఒకరైన పుట్టారామకృష్ణారెడ్డి మేయర్ తరపున వకల్తా పుచ్చుకొని మాట్లాడినప్పటికి ప్రతిపక్ష సభ్యులకు ధీటుగా సమాధానం చెప్పలేక ఇబ్బంది పడాల్సివచ్చింది. రెండు దఫాలు స్టాండింగ్ కమిటీ సమావేశం వాయిదా వేసిన మేయర్ చివరకు మెజార్టీ సభ్యులతో అజెండాను ఆమోదిస్తున్నట్లు ప్రకటించి ఆశ్చర్యపరిచారు.

అజెండాలో పేర్కొన్న అంశాలకు సంబంధించి లేవనెత్తిన ప్రశ్నలకు సమాధానం చెప్పాలని ప్రతిపక్ష కార్పొరేటర్లు పట్టు పట్టినప్పటికి మేయర్ ఖాతరు చేయకుండా పాత విధానాన్ని కొనసాగించారు. మేయర్ వైఖరిపై తప్పుపడుతూ స్టాండింగ్ కమిటీ సభ్యులుగా ఎన్నిక కావడం తమ దౌర్భాగ్యమంటూ కత్తి శ్రీనివాసులు, రూప్‌కుమార్‌లు ఆవేదన వ్యక్తం చేయడం జరిగింది. సమావేశం జరుగుతున్న సమయంలో కపాడిపాళానికి చెందిన కోటమ్మ అనే కాంగ్రెస్ కార్యకర్త లోనికి ప్రవేశించి మేయర్‌ను ప్రశ్నించిన కార్పొరేటర్లనుద్దేశించి వ్యంగ్యంగా వ్యాఖ్యానించడం విశేషం.



స్వర్ణభారత్ ట్రస్ట్ ప్రేరణతో వెంకటాచలంలో పెట్టిన అక్షర విద్యాలయ ప్రారంభోత్సవ పూజలో బిజెపి జాతీయ నాయకుడు వెంకయ్యనాయుడు. కలెక్టర్ రాంగోపాల్, నాయుడుగారి సతీమణి ఉషమ్మ.

# పేరు ఓదార్పు - ప్రయత్నం బెదరింపు!

వైఎస్ జగన్ ఓదార్పు యాత్ర జయప్రదంగా నడిచి పోతున్నది. గోదావరి, ఖమ్మం జిల్లాలలో అడుగడుగునా జననీరాజనం లభిస్తున్నది. వెళ్లిన ప్రతిచోటా వందలు, వేలల్లో జనం. గంటల తరబడి వాహనాన్ని కదలనివ్వకుండా అడ్డుపడి, హారతులు పడుతున్నారు. రక్త తిలకాలు దిద్దుతున్నారు. జగన్ కూడా ఫక్తు సినీ తరహాలో వ్యవహరిస్తున్నారు. వైఎస్ మరణ వార్తను తట్టుకోలేక ఆత్మహత్యలకు, అకాల మరణాలకు గురైన కుటుంబాలను పలకరించి, ఓదార్చడం ఈ యాత్ర ఉద్దేశం. నిజంగా అదే తలంపు అయితే, నేరుగా వారి ఇళ్లకు వెళ్లి, నాలుగు వూరడింపు మాటలు చెప్పి, తానివ్వదలచిన లక్ష రూపాయల పారితోషికాన్ని చేతిలో పెట్టి వెనుదిరిగి రావాలి. కానీ ఆయన దీన్నొక రాజకీయ బలప్రదర్శనా యాత్రగా నడుపుతున్నాడు. తాను చేరవలసిన చోటులో, తనకంటే ముందు వేలాది జనం పోగుపడేట్లు చూసుకొంటున్నాడు. ఇటువంటి విద్యలలో ఘనాపాటి అయిన కెవిపి రామచంద్రరావు అందుకు చాలా జాగ్రత్తలు తీసుకొంటున్నాడు. ఆయా ప్రాంతాలలోని ఎమ్మెల్యేలు, వైఎస్ అనుచరులు, కాంగ్రెస్ వాదులందరికీ ముందుగానే ఫోన్లో ఆదేశాలు జారీ చేసి, జనాన్ని సమీకరించి, వందలాది వాహనాలు జగన్ వెనుకనడిచేట్లు ఏర్పాటు చేస్తున్నారు. బాధితుల ఇళ్లకు వెళ్లిన జగన్, ఆయా కుటుంబసభ్యుల చేత గోరు ముద్దలు తినడం ఇంకా పెద్ద ప్రహసనం. పకడ్బందీగా రచించిన నాటకం వలె రక్తి కడుతున్నాయి ఆ దృశ్యాలు. సాక్షి టివి, దిన పత్రికలలో దృశ్యాలన్నీ ఆ సన్నివేశాలే కావడం గమనార్హం.

నాలుగు నెలల క్రితమే తలపెట్టిన యాత్ర ఇది. అయితే అప్పట్లో ఆయన మీద అధిష్టానం గుర్రుగా వుండింది. కాలు కదిపినా, నోరు మెదిపినా తప్పు పట్టే పరిస్థితి. దానితో ఎప్పటికప్పుడు వాయిదా వేసుకొంటూ వచ్చాడు. ఎన్నో గడువులు దాటిన తర్వాత, ముఖ్యమంత్రి రోశయ్యతో రాజీ భేటీ జరిపి, వారిద్దరికి మాత్రమే తెలిసిన ఒప్పందం కుదుర్చుకొని యాత్రకు బయలుదేరాడు. వైఎస్ తర్వాత కాంగ్రెస్ పార్టీలో తానొక్కడే జనాకర్షణ కల్గిన నేత అన్నది రుజువు చేయాలన్న తాపత్రయం జగన్ యాత్రలోని ప్రతి అడుగులోనూ కన్పిస్తున్నది. వెళ్లిన ప్రతిచోటా ఆయన్ను స్వాగతిస్తున్న జనసందోహాలను అటు కాంగ్రెస్ అధిష్టానం, ఇటు ప్రతిపక్షాలు కూడా సునిశితంగా గమనిస్తున్నాయి. ఎన్నికలకు నాలుగు సంవత్సరాల సుదీర్ఘ వ్యవధి వున్న సమయంలో ఇటువంటి సభల తీరుకు పెద్దగా రాజకీయ ప్రాధాన్యత వుండదు. కానీ కాంగ్రెస్‌లో ముందు ముందు జరగబోయే పరిణామాలకు ఇవొక సంకేతం అన్న ప్రచారం జరగడం వల్ల అందరి కళ్లు దీనిపై పడుతున్నాయి.

వైఎస్ మరణించిన రోజు రాష్ట్ర కాంగ్రెస్ పార్టీ మొత్తం జగన్ వెనుక నిలబడింది. ఆయన్ను ముఖ్యమంత్రిని చేయాలని ఒకరిద్దరు తప్ప అందరు శాసనసభ్యులు సంతకాలు పెట్టారు. అయితే అది ఎంతోకాలం నిలవలేదు. రోజులు గడిచే కొద్దీ ఒకరొకరుగా ఎమ్మెల్యేలు జారుకొంటూ వచ్చారు. ఒకనెల ఇవతల అయితే మంత్రులు కూడా జగన్‌కు ముఖం చాటేస్తున్నారు. ఆయన పక్కన నికరంగా పది మంది కూడా నిలబడేట్లు లేరని కరుణాకర్‌రెడ్డి వంటి వైఎస్ వీరభక్తులే వ్యాఖ్యానించిన పరిస్థితి. అయితే ఈ యాత్రతో మరొకసారి జగన్ ప్రాభవం పునరుజ్జీవం పొందింది. ముఖ్యమంత్రి రోశయ్యతో అనుబంధం కలిగి, తమ జిల్లాకు వచ్చిన జగన్ వద్దకు వెళ్లకుండా నిగ్రహం పాటించిన బంగారు ఉషారాణి, అంజయ్య వంటి కాంగ్రెస్ ఎమ్మెల్యేలు రెండు రోజుల పాటు యాత్ర జరిగిన తీరు చూసి, ఎందుకైనా మంచిదని బంధాలు తెంచుకొని జగన్ వద్దకు వెళ్లిపోయారు. దాన్నిబట్టే కాంగ్రెస్ ఎమ్మెల్యేలలో జగన్ యాత్ర తెచ్చిన ఉత్సాహాన్ని అర్ధం చేసుకోవచ్చు.

పార్టీలో తనకంటే మిన్న అయిన నేత మరొకరులేరని నిరూపించడం ద్వారా అధిష్టానానికి స్పష్టమైన సంకేతాలు పంపడానికి ప్రయత్నిస్తున్నాడు జగన్. తనను కాదంటే ఆంధ్ర రాష్ట్రంలో కాంగ్రెస్‌కు పుట్టగతులు వుండవన్న పరోక్ష బెదరింపుకు ఈ యాత్రను వాడుకొంటున్నాడు. ఈ పరిణామాన్ని కాంగ్రెస్ అధిష్టానం ఏ తీరులో ఎదుర్కొంటుందో వేచి చూడాలి.

# మద పిచ్చా? మతి చెడిందా?



పైనున్న బొమ్మ చూడండి. నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి ఒక పదహారేళ్ల బాలికను పబ్లిక్‌లో కౌగిలించుకొని, ఆమె తలలోని మల్లెపూల సువాసనను ఆస్వాదిస్తున్న దృశ్యం అది. నవాబుపేటలోని బివిఎస్ హైస్కూల్‌లో జరిగిందీ నీచమైన సంఘటన.

బడికి వెళ్లే పిల్లలకు మెదడు వాపు నిరోధ టీకాలు వేసే కార్యక్రమానికి అతిథిగా హాజరయ్యాడు వివేకానందరెడ్డి. ఇటువంటి సభలకు వచ్చిన రాజకీయవాదులు వేదిక ఎక్కి, నాలుగు మంచి మాటలు చెప్పి వెళ్లడం మర్యాద. కానీ మంచి, మర్యాద అన్న పదాలకు అర్ధం ఆనం సోదరుల తలకు ఎక్కవు కదా? వేదిక వదలిపెట్టి, మేయర్ భానుశ్రీని తన పక్కన పెట్టుకొని, ఆడపిల్లల మధ్యలోకి చొరబడ్డారాయన. ఒక్కొక్క అమ్మాయిని పలకరిస్తూ, వారి తలలు నిమురుతూ, చెవులో గుసగుసలు చెప్తూ తిరిగాడు. ఉన్నట్లుండి, అందరూ నివ్వెరపోయి చూస్తుండగా ఈ బాలికను దగ్గరకు తీసుకొని, గాఢంగా కౌగిలించుకొని, తలలోని పూల వాసన చూడడం మొదలు పెట్టాడు. మరొకరెవరైనా ఈ నీచమైన పని చేసి వుంటే అక్కడున్న అయ్యవార్లు చెట్టుకు కట్టి, చెప్పులతో కొట్టించి వుండేవారు. కానీ అధికార మదం తలకెక్కిన ఆంబోతు వంటి నాయకుడికి అడ్డం పోవడం బ్రతకలేని బడిపంతుళ్లకు అలివయ్యే పని కాదు కదా? చూడడానికే అసహ్యం వేస్తున్న ఆయన పోకడను చూడలేక కళ్లు మూసుకోవడం తప్ప ఏమీ చేయలేకపోయారు వారు.



పదవ తరగతి చదివే పిల్లలకు పదిహేను, పదహారేళ్ల వయస్సు వుంటుంది. ఆ పరువంలో వున్న వారిని స్వంత సోదరులు కూడా తాకడానికి సందేహిస్తారు. అది మనకు పెద్దలు నేర్పిన సంస్కారం. ఈ ప్రబుద్ధుడికి మద పిచ్చి పట్టిందో, లేక మతి చెడిందో తెలియదు కానీ, ఏకంగా ఆ వయస్సులో వున్న బాలికను కౌగిలించుకొని ముద్దాడే నీచమైన అకృత్యానికి పాల్పడ్డాడు. కీచకుడి వంటి ఎమ్మెల్యే పబ్లిక్‌లో తనతో సరసాలాడుతుంటే, పాపం ఆ బాలిక మనసు ఎంతగా విలవిలలాడి పోయి వుంటుందో?

ఇదే సభలో మరొక వికృత చేష్టకు కూడా పాల్పడ్డాడు వివేకా నందరెడ్డి. వాక్సిన్ వేయడానికి సిద్ధంగా వున్న డాక్టర్లను పక్కకు నెట్టి, మేయంతో కలిసి తానే స్వంతంగా పిల్లలకు ఇంజెక్షన్లు వేయడం మొదలు పెట్టాడు. భానుశ్రీ సిరంజిలోకి వాక్సిన్ ఎక్కిస్తుంటే, ఈయన సూది పొడిచాడు. శంకర్‌దాదా ఎంబిబిఎస్

కొరవ 14వ పేజీలో

Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore.